# ఒప్పందం

(కథల సంపుటి)

అనువాదం

'కనక్ ప్రవాసి'



పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# OPPANDAM

(And other Stories)

Translated by

'KANAK PRAVASI'

1st Edition 1960

Price Re. 1/-





Publishers: ADDEPALLY & CO.

SARASWATHI POWER PRESS

RAJAHMUNDRY (A. P.)

# విషయసూచిక

# పెరల్ బక్ కథలు

## ఒప్పందం

ఎలిజబెత్ బాండ్స్, భర్త మార్టిన్ వీధిలోకి వెళ్ళడం చూసింది. క్రితంసారి ఇద్దరూ పోట్లాడుకున్నప్పుడు మళ్ళీ 36 గంటలవరకూ ఏమీ కీచులాడుకోకూడదని ఒక నిశ్చయం చేసుకున్నారు. అదేపనిగా ఎంతకాలం పోట్లాడుకుంటూ ఇంట్లో కాపరం చెయ్యగలరు? ఆపోట్లాటకు అంతూపొంతూ లేకపోవడంచేతే ఒకళ్ళ కొకళ్ళు లోకువై పోయారు. ఆవేళ ఎలిజబెత్ భోజనం బల్లదగ్గర కూర్చుని జంకుతో మార్టిన్‌ను పిలిచి కూర్చోపెట్టినప్పుడే ఆమెకా ఉద్దేశం కలిగింది.

“మన మిద్దరం తాత్కాలికమైన సంధి ఒకటి చేసుకుందాం రేపటిరాత్రి దాకా మనం ఏవిషయంలోనూ పేచీ పెట్టుకో కూడదు. అంతా కూర్చుని మాట్లాడుకుందాం. తరవాత ఏం చేయగలమో చూడచ్చు. ఇట్లా ఎల్లకాలం గడపడం కష్టం. పరస్పరం ఒకరి నొకరం అర్థంచేసికోవడమో విడిపోవడమో ఏదోఒకటి జరగాలి. లేకపోతే ఎంతకాలమని!” అన్నది ఎలిజబెత్ భర్తకేసి వింతగా చూస్తూ.

ఆమాటలు ఆమె నిర్భయంగా చెప్పగలిగిం దీసారి. ఇంత క్రితం ఎన్నోసార్లు చెప్పాలని సిద్ధపడ్డది. ప్రతీసారి ఆమెను ఏదోభయం ఆవహించి పైకి అనలేకపోయేది. కాని ఇన్ని సంగతుల్లో ఒక్కటీ అతనికి తెలియదు.

"ఆఁ మనం ఇట్లా ఎల్లకాలం గడపడం కష్టం" అని ఏదో ఆలోచిస్తూనే అంగీకరించి అతను నెమ్మదిగా చేతులు పైకి ముడుచుకొని నెమ్మదిగా ఆమెనుదుటిమీద ముద్దుపెట్టుకోడానికి దగ్గరగావచ్చి తిరిగి గదిబయటకు వెళ్ళిపోయాడు.

కోటు హేట్ వేసికొని మొదటిగేట్ దాటి అతను వెళ్ళే వరకూకూడ ఆమె కదలకుండా చేతులమీద తలను వ్రేలాడేసికొని చూస్తూ కూర్చుంది. ఉభయులూ తీవ్రమైన కృషి చేయగా చేయగా చివరికి ఈవిధంగా అయింది. వాళ్ళిద్దరూ పక్కింటి బిల్, అతని భార్యలాగ చిన్నపిల్లల్లా అస్త్రమూనూ వాదించుకోడం కొట్టుకోడంతో వీధి పోట్లాట రంగం లా చేసికోరు.

అయితే వారిద్దరూ పరస్పరం ప్రేమించుకొంటూరు. మార్టిన్‌కి కూడ స్టెనోగ్రాఫర్లమీద, కార్యదర్శులమీద ఎట్లాంటి అభిలాషలూ లేవు. ఎలిజబెత్‌కు కూడా అతణ్ణితప్పించి మరెవరిలోనూ కుతూహలంలేదు. మూడోమనిషి మీదకానీ, ఇతర ప్రేమలమీదకాని వాళ్ళిద్దరిమధ్యా ఎట్లాంటి ఉద్దేశాలూ లేవు. ఎవళ్ళఇష్టాలువాళ్లు తీర్చుకుంటూ హాయిగా బ్రతకాలనేదే ఉభయుల అభిప్రాయమున్నూ.

అయినా ఆమెకెందుకో అతను ఇంట్లోంచి బయటకువెళ్ళిపోయినప్పుడే హాయిఅనిపించేది. ఈచిత్రమైనమనోభావంఏమిటా అని ఆమె ఆశ్చర్యంకలిగేది. అతనింట్లో వున్నంతసేపూ ఆఇల్లు ఆమెకి తనదికాదనిపించేది. కాని ఇప్పుడాఇల్లు ఆవిడ సొంతమే. అతనికి తన సుఖంఏదో అంతే. మిగిలినవేమీ అతనికిపట్టవు

ఇంట్లో బాగోగులు, బాధ్యతలు అన్నీ ఆవిడే చూసుకోవాలి. "ఇదేమిటీ పద్ధతి" అని ఆవిడ అడిగినప్పుడు అతను "అలా చేయడం నాకిష్టం" అంటాడు. ఆఇంట్లో అతని కిష్టంలేని దేదైనా వున్నదంటే మొద్దులాంటి ఆ పాత జపాన్ నీలం ప్రింటును చెప్పవచ్చు - కారణమేమిటని అడిగితే అది ఎందుకో తనకర్థంకాదంటాడు. తన కర్థమయ్యేచిత్రం వుంటే దాన్ని అభిమానిస్తాడు. పాలిపోయి, బల్ల చెక్కలావున్న ఆముఖం ఆనీలంగుడ్డ వెనకనుంచి కనబడుతూంటే నాకు డోకువచ్చిన ట్లనిపిస్తుంది అంటాడు. జపాన్ దేశస్థులు వాళ్ళచిత్రాలను అభిమానిస్తే అభిమానించవచ్చుగాక - కాని అతను అమెరికా వాడు - అతని కెటా నచ్చుతా యవి ?

అతనికి నచ్చని వస్తువులు గురించి తలపోస్తూ ఆవిడ అట్లానే కూర్చుని ఆలోచిస్తుంది. క్రితంరాత్రి ఆమెకోసం అతనొక పెట్టెడు చాక్లెట్లు పట్టుకొచ్చాడు. కాని ఆవిడకవి ఇష్టం వుండవు. అవంటే ఆవిడ కసహ్యం. కాని వాటిని తేవడం అతనెప్పుడూ మరచిపోడు. అవే అతనికెక్కువ ఇష్టం.

ఉన్న పాళంగా కూర్చున్నచోటినుంచి లేచి ఆవిడ దీర్ఘంగా నిట్టూర్చి, తాను వ్రేలాడగట్టినచోటే ఆ ఫొటో వుండడం చూసుకుంది.

*　　　　*　　　　*

ఇద్దరూ ఆవిషయాలు ఎట్లా సులభంగా పరిష్కరింతా మనుకుంటారో, అలాగే వాటికోసం పశ్చాత్తాపపడడానికి కొట్టుమిట్టాడిపోతారు. ఆ 36 గంటల్లోనూ నాలిక చివర దాకా

ఏవేవో తీవ్రమైన మాటలువచ్చేవి. ఒకరినొకరుఉండిఉండి చూసికొనేవారు. పైకిమాత్రంసాహసించి అనలేకపోయేవారు. వాళ్ళుచేసే పనేమిటో వాళ్ళకి అర్థంకాకుండా నే పోట్లాడుకోడం అలవాటైపోయింది వాళ్ళకి. అతను క్రితంరాత్రి ఇంటికి రాలేదు. మేడ మెట్లక్రింద, దగ్గరలోవున్న అతనికోటుబిరికి (కోట్ హేంగర్) కే ఎప్పుడూ ఆమె తన కోటుఎందుకుతగిలించాలో తెలిసికొనే పర్యంతం అతను ఇంట్లో అడుగుపెట్టిన న్నాడు. అతని కట్లాంటి కోటుబిరికీ ఒకటి ప్రత్యేకంగా వున్నట్లే తనకి తెలియదంటుందామె. ఇంట్లో ఆమెకేవిషయం అసలు పట్టలేదని అతను ప్రారంభించాడు. ...... ఒకక్షణం తర్వాత ఆఇద్దరూ ఒకరినొకరు చూసుకుని గుర్తుకుతెచ్చుకున్నారు. లక్షసార్లు వాళ్ళకిజ్ఞాపకం వుంది. ఈ రెండోరోజున ఆఖరికి తానేఎక్కువపూనుకొని అతనితో మాట్లాడేనేమో అని ఆమె కనిపించింది. ఎందుకంటే అతనితో మాట్లాడినప్పుడల్లా తన నేకో అతనుఇబ్బందిపెడుతున్నట్టూ పరీక్షచేస్తున్నట్టూ అనిపించింది. పైగా ఆరాత్రి అతను భోజనాలప్పుడు నిశ్శబ్దంగా, ఏమాత్రం మాట్లాడేప్రయత్నంకూడ చెయ్యకుండా కూచున్నాడామె.

సరిగ్గా అప్పటికో 36 గంటలూ గడిచినై. నిప్పుదగ్గర చెరో వైపున కూర్చుని ఒకరినొకరు చూసుకున్నారు. అతనికి గోటుగా, నీటుగా కనిపించాలని ఆమె ముందు కొంత జాగ్రత్తపడనే పడ్డది. ఇద్దరికీ నచ్చినబట్టలుకొన్నే వుంటాయి. అందులో లేతఎర్రరంగుదుస్తులు ఆమెధరించింది. ఆమెకు

నచ్చిన విపరీతమైన వింత వేషాలు అతనికికిట్టవు. తీరైన, సాదా దుస్తులు వేసికొంటే అతనికిష్టం. ఆఎర్రరంగుదుస్తులు ఆమె ఒంటికి చక్కగా అమిరాయి కనక అవి అతనికి మోజు. ఆవిడకు ఎట్లారంగంటే ఇష్టంకనక అవే ఆవిడకూ అతనికీ కూడ నచ్చాయి.

ఆమెపట్లనేకాక, తనకుతానుగా ఏదో అసాధారణమైన జాగ్రత్త అతను కనపర్చడం ఆమె కనిపెట్టింది. నల్లని కోటు వేసుకోవడం దానిమీదే ఏరంగూలేని 'టై' వేసికోవడం ప్రారంభించాడతడు. లోపల బాధపడుతూనే అతని మృదువైన జుత్తు, అందమైన కళ్ళు చూస్తూ, ఎంత అాదంగా కనిపిస్తున్నాడో అనుకుందామె. :ఇంతకీ అసలు చిక్కు...అదేనేమో! ఇతను మంచి అందగాడు. అతను తప్ప ఆమెకింకేమీ అందంగా కనబడవు. ఎందుకో తెలీదు. కొంచెం సాగసైన వాళ్ళని చూస్తే ఆవిడలో ఏదో బలహీనత వస్తుంది. చక్కని ఆడవాళ్ళని చూసినా అంతే. బహుశా తను అందమైనది కాకపోవడంవల్ల అట్లాఅయి వుంటుంది. ఆమె బాగా నలుపు, బాగా పొడుగు. విపరీతమైన లక్షణాలు- ఒక్కో సమయంలో, ఆమె చాలా అందంగావుంటుందని ఆమెతో పై వాళ్ళుఅంటుంటారు. చిత్రంగా, ఇంకా చిన్నపిల్లలా, మరింత అందంగా గోముగా ఉండాలని ఎప్పుడూ తనలోతను రహస్యంగా అనుకుంటూంటుందామె. సరిగ్గా అట్లాంటివాళ్ళనే మగవాళ్లు "కుర్రదానిలాగ" అంటుంటారు. దేనికీ, ఏవిషయంలోనూ కూడ మార్టిన్ ఆమెను "చిన్నపిల్లలాగ" అని అనడు.

ఎందుకు అనడో? అతనే ఒకవేళ అనేట్లయితే ఉభయులూకూడ ఫెళ్లున నవ్వుకోకండా వుండలేరు.

అట్లా ఆమెలో గర్భితంగా వున్న కోర్కెను అతనెప్పుడూ గ్రహించలేదు. ఆమె ఎన్నోసార్లు అతనిఇష్టానికి సరిపడ్డట్టు చురుకైనదాసిగా, సమర్ధురాలిగా, అనుంగుభార్యగా, చివరకి అతనికి లెబొరేటరీ (పరిశోధనాగారం) లోకూడ సహాయపడగలిగేంత సమర్ధురాలిగా మారిపోవాలని ప్రయత్నంచేసేది. సంగీతసాధన ఒక అలవాటవడంవల్ల ఆమెచేతివేళ్లు అతనిపనిలోని శిల్పనైపుణ్యం కొంతవరకూ అతిత్వరలోనే సున్నితంగా చురుకుగా తెలుసుకోగలిగినై. ఇంట్లోకన్న 'లేబొరేటరీ' లో ఇద్దరూ చాలా తక్కువగా కీచులాడుతారు. అక్కడ మినహా మరింకెక్కడా అతని మీాద అంత విపరీతమైన అభిమానం, ఆదరం కలగవు ఆమెకు. అక్కడే అతనుకూడ ఆమెను కాస్త మెచ్చుకొనేది కూడ .."మంచి పనికత్తెవి" అంటాడు ఒకసారి. మరోసారి "చాలా చురుకైన దాసివే" అంటాడు. అంతే. అవి లేబరేటరీలో మాత్రమే. ఇంకా రాత్రులు కుంపటిదగ్గర తప్పితే ఇంట్లో మరెక్కడా అట్లాంటి ప్రశంసా వాక్యాలు వినపడవు.

"ఏం మార్టిన్?" నెమ్మదిగా ఆమె పిలిచింది.

"ఎలిజబెత్? ఏం!" కొంచెంసేపు ఆగి అన్నాడతను — ఆసమాధానం ఇచ్చేందుకు వ్యవధి ఎందుకో?

వెనక అలవాటులోవున్న కోపం పెదవులమీాదికి విసురుగా వస్తున్నట్టు ఆమె కనిపించింది. అట్లాంటి సమయాలే వాళ్ళని

పోట్లాడుకునేట్టు చేస్తాయి. అతనెప్పుడూ రక్షణగా అన్ని విష యాల్లో జాగ్రత్తపడతాడు. అది నిజానికి అతనిలోని విజ్ఞాన స్వభావమేమో! ఆమె రెచ్చిపోవడానికి అతను ఒక్కడే కారణంకాదు. మాట్లాడేప్పుడు నెమ్మదిగా నవ్వుతూనే మాట్లా డుతుంది. "చివరకి నీఉద్దేశం ఏమిటి మార్టిన్ ... శాస్త్ర వేత్తలా చెప్పు?"

అతనికి పైప్ కావలసివచ్చింది. "నువ్వనేది...మనలను గురించేనా?" కాస్సేపు ఆలోచించింది—తిరిగి ఆవిషయాన్ని నెట్టేసేవాడే —

"అవును మనదే" అంది జ్ఞాపకంచేస్తూ.

పైపు వెలిగించి దమ్ములాగాడు. ఆమె ఓపిక పట్టుకుకూర్చుంది.

"ఏమిటి ఆలోచిస్తున్నావ్"అని అడిగాడు.

"ఒకరినిగురించి" అని వెంటనే జవాబిచ్చింది. "నువ్వు ఏమనుకుంటున్నావో పూర్తిగా వినేవరకూ ఓపికపట్టిఉండ గల్ను — 'పూర్తిగా వినకుండా మాట్లాడుతుంటావు నువ్వు' అని నామీద నువ్వుచేసే ఆరోపణలు ఒక్కొటొక్కటేజ్ఞాపకం చేసికొంటున్నా".

అతను చాలాసేపు కుంపటికేసి చూసి అన్నాడు: "నేను నిన్ను తప్పుదారిని నడుపుతున్నాననుకుంటున్నావు. నేను చేసే ప్రతిపనీ నీకు తప్పుగా కనిపించడమేకాదు, అది నీ కా విధంగా చేయడం నచ్చకపోవడం కారణంగా తప్పుచేస్తున్నకంటె తప్పు దోవలో వున్నట్లు కనిపిస్తున్నాను. అయితే మనకేపిల్లలున్న ట్లయితే ఇంతంతసేపు ఒకరినొకరు తప్పులు పట్టుకొంటూ

దుయ్యబట్టుకుంటూండడానికి త్రైము వుండేది కాదేమో ”

“పిల్లలు” అన్నమాట వినేసరికి ఆమెహృదయానికి ఎక్కడాలేని సత్తువవచ్చింది ఆమెకి పిల్లలుకలగరు. నిజానికి పెళ్ళిఅయినప్పుడు ఆమెకావిషయం తెలీదు. ఆతరవాత ఎప్ప టికోకాని ఆమెకాసంగతి తెలీలేదు. అట్లాంటి సత్తువలేకపోతే నిగ్రహించుకొని ఆమె “పిల్లల” నే మాట వినలేదు.

ఓసారి మండేకుంపటికేసి చూసింది. అది చాలా మంచి కుంపటి. ఆవిడే దాన్ని సిద్ధంచేసింది. ఆఇల్లుకూడ ఎంతో హాంగైనది. ఆఇంటినే ఆవిడ తనఅభిప్రాయాలకు అనుగుణంగా మార్చాలనుకునేది. అయితే తమకే పిల్లలుంటే ... ..... ఆఆలోచన మానేసింది. అతనెప్పుడూ తప్పుగానే కనిపిస్తాడు తనకి ......... అవును అతనే ఒప్పుకున్నాడుగా!

“అయితే నన్నుగురించీ అట్లాగే అనుకుంటున్నా వను కుంటా” అందికొంచెం విచారంగా.

“నాకు తెలీదు” అని జవాబిచ్చాడతడు.

తిరిగి అతను పైప్ పీల్చడం ప్రారంభించి ఓఅగ్గిపుల్ల గీశాడు ... వెధవది; ఆఅగ్గిపుల్లగీసినపద్ధతి కూడా పోట్లాటకు కారణమవుతుంది. నెమ్మదిగా అతను అగ్గిపుల్ల గీస్తే ఆమె సహించలేదు. అసలు అగ్గిపుల్లగీసినప్పుడు అయే చప్పుడే ఆమెకసహ్యం. అది ఆమెకోపాన్ని ఒక్కసారి ఊపి చూస్తుంది. ఆవిషయం అతను పాపం మరచిపోయాడు. తిరిగి అతను నెమ్మ దిగా అగ్గిపుల్లగీస్తున్నాడు. ఎప్పుడు ఆపుల్లవెలిగి, అంటించు కోవడం పూర్తయి ఆరిపోతుందా-అని ఒక్కక్షణం ఆమెగట్టిగా

ఉగ్గబట్టుకు కూర్చుంది. చివరినిమిషంవరకూ ఆమె ఆ విషయం చెప్పలేదు. అయినా ఆమె కదో పెద్దవిషయమూ కాదు.

"నువ్వు చేసే ప్రతీపనీ నాకానందం కలిగించదు. ఆనందం కలిగించేదిగా నా కనిపించదు" అన్నాడు ధాటీగా పొగ వదలుతూ అతడు.

"విమర్శకి గురయినవాడే తిరిగి విమర్శించడానికి సిద్ధమౌతాడు – అయితే నాకుండేలాంటి చిన్నచిన్న అలవాట్లేమీ నీలో లేవా?"

"నాలోవున్నది ఒక్కటిచెప్పు. ఒక్కటి ఉదాహరణకి" అన్నది కొంచెం భయపడుతూనే. అయితే ఆమెలోనూ ఏవేవో లేకపోలేదు.

"ఆ" అన్నాడు ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ, "మాట్లాడుతూనేఉంరికే కాఫీ తెగ తిప్పితిప్పి పోస్తావు. అదో అర్థంలేని పని. పంచదారవుంటే వెంటనే కరిగిపోతుంది. అయినా సరే వెట్టిగా కలుపుతావు." –

ఇక వేరేమార్గం ఏమీదారక్క బలవంతంగా ఆమె దానినిఅంగీకరించి "అలాచేస్తానో లేదో సరిగా నాకు జ్ఞాపకం లేదు" అంది.

"నీకు జ్ఞాపకంవుండకపోతే పోవచ్చు. నాకు మాత్రం జ్ఞాపకం వుందిలే!" అన్నాడు దారిలోకితెస్తూ.

"అయితే ఎప్పుడూ ఆవిషయం ఎందుకు చెప్పలేదు?"

"ఎప్పుడో ఒకప్పుడు చెప్పే అవసరంవస్తే చెబుదామని అనుకున్నా" అని నెమ్మదిగా సమాధాన మిచ్చాడు.

"ఇంకా ఎన్నింటిని గురించో నువ్వు చెప్పేవు. నేను కట్టుకొనే పద్ధతి నీకు నచ్చదు. నేను సంగీతం వాయించే పద్ధతి నచ్చదు......" అన్నది కోపంగా.

"అవి మరీ ముఖ్యంగా చెప్పాల్సినవి" అని రెచ్చగొట్టాడతను. "నలుగురూ మెచ్చుకొనేట్లు బట్టకట్టుకోవడం నీకు తెలీదు. పాడుగాటిదానివి - నువ్వు పియానో దగ్గర ఊగే పద్ధతి బావుండదు"—

"ఇవన్నీ నాకు తెలీకుండానే అన్న మాట?"

"నువ్వా పద్ధతిగా చేస్తూంటావని మాత్రం చెప్పా. అంతే" -

"ఓమూర్టిన్ - నువ్వు అదే మళ్ళీ మళ్ళీ ఎన్ని సార్లయినా చెప్పొచ్చు..." ఆమెగొంతులో వెనకటి ఆగ్రహం తిరిగికనిపించి అదే ఆమెచెవులలో ధ్వనించింది. అయితే ఆకోపంతో అతనికి పాఠం నేర్పుతుందా? బాధిస్తుందా?

"మనపెళ్ళి కాకముందునుంచీ నీలో అది కనిపెడుతూనే వున్నా"

"అలాగా." అన్నది గొణుగుగా, పెదవికొరుకుతూ.

ఆమె అన్న మాట అతను వినిపించుకోదలుచుకో లేదు. "పెళ్ళిఅయినతర్వాత నీ తిరుగుబాటుపద్ధతిని తెలుసుకున్నాను కనక చెప్పాలనుకున్నాను..."

"తరవాత్తరవాత తగ్గిపోతుందేమో అనుకున్నావా?"

"లేదు. అప్పుడే ఇద్దరం కలిసికట్టుగా ఉండడం జరుగుతుందేమో అనుకున్నాను. ఇద్దరం సన్నిహితంగా వుండడం ఎప్పుడూ జరగనే లేదుకదా ఎలిజబెత్! — పెళ్ళయినతర్వాత

ఇప్పటికన్న పెళ్ళికాకముందే ఎంతో హాయిగా కలిసిమెలిసి వుండేవాళ్ళంకదా " —

తనకోపంలో చాలామట్టుకు ఒకరకమైన విభ్రమోద్వేగంలో అణగారిపోతున్నట్లు ఆమెకనిపించింది. ఆలోచిస్తే అతను చెప్పిన మాటల్లో ఎంతయదార్థమున్నదో ఆమెకు తెలుస్తూంది; ఆప్రథమదినాల్లో ఇద్దరూ ఎంత అన్యోన్యంగా ఉండేవారో! అంతక్రితమే కాలేజీనుంచి ఇంటికివచ్చేసింది. ఇంటిదగ్గర ఆమెకు ఏంచెయ్యాలో తోచిందికాదు; చేయాల్సినవికూడ చాలాపనులు కనిపించాయి. విధిగా తనుచేయవల్సిన వాటిల్లో 'సంగీతసాధన' ఒకటి. కాలేజీలో చదువుతున్నప్పుడు కూడ ఆమె సాధన మానలేదు. ఎందుకంటే తల్లికి అది ఇష్టం. పట్టభద్రురాలైన తన ముద్దులకూతుర్ని కళ్ళారా చూసికొనే యోగ్యతలేదు ఆవిడకి — చనిపోయింది. చదువూ, సంగీతం, తనకేవుండాలని వెంపర్లాడిపోయింది తల్లి — కాలేజీ చదువు తర్వాత — సంగీతం ... సంగీతం ... ఏమైంది. ... ఏమైంది. తండ్రితో కూర్చుని ఎన్నోఆలోచించేది. గ్రామంలో పాఠాలు చెప్పి కొంత ఆమె సంపాదించేది. తండ్రి చర్చిలో పనిచేయగా వచ్చిన జీతంలో ఆమెకు కొంతఇచ్చేవాడు.

తరవాత ఆవేసవిలో మార్టిన్ ఆగ్రామానికి వాళ్ళ పినతండ్రిగారింటికి వచ్చాడు. ఇద్దరూ ఒకవిందులో మొదటిసారి కలుసుకున్నారు. తరవాత్తరవాత స్నేహం బలపడింది. అతను తనుచేసే పనినిగురించి చెప్పేడు — ఆమె తనపనిని గురించి చెప్పింది .. " ఒక్కసారితిరిగి అతని అందమైనముఖం, బల

మైనచేతులు, ఆమెకు గుర్తొచ్చాయి; అప్పు డతని లాంటి యువకు లెవరూ ఆమె కా గ్రామంలో కనిపించలేదు. స్త్రీల కళాశాలలోనే చదవడంచేత ఆమెకు ఎక్కువమంది మగవాళ్ళతో పరిచయంలేదు. ఏది ఏమైనా ఆమె మగవాళ్ళతో స్నేహంచేయడానికి సాహసించింది. తనూ ఎప్పుడూ ఆడ పిల్లలతో స్నేహంచేసినవాణ్ణి కానని అతనే అన్నాడు ఓసారి. తనకూ ఈస్నేహం కలగడం ఎంతో ఆనందంగా వుందని కూడ అన్నాడు. ఎలిజబెత్ లాంటి హుషారైన పిల్లలతోనే నిజమైన స్నేహం చేయాలనుకున్నాడు. చేశాడు. "అల్లరి పిల్లలంటే నాకసహ్యం" అన్నాడు ఒకసారి. అందగాడు కనక, కూడా ఆడపిల్లలుంటే ఉండచ్చు. అదీ ఆమె ఎరుగును. చాలామంది స్త్రీలు మగవాణ్ణిగురించి ఇంకేమీ ఆలోచించరు— చూపులుతప్ప మిగిలిన విషయాలేవీ వాళ్ళకి తెలీవు. తన రొమ్ములలో ఒకరకమైన ఈర్ష్యాభావం ముసురుకోడం ఆమెను ఆశ్చర్యచకితను చేసింది. తానెందుకు ఈర్ష్యపడాలి అనుకొన్నది. ఆవేసవి అంతా ఆమె దానితోనే బాధపడ్డది. ఆ ఈర్ష్యే అతనికి ఆమెను అతిచిత్రంగా మోకరిల్లేటట్లు చేసింది. కొత్త వెలుగులు ఏవో ఆమె కళ్ళల్లో మెరిసినై. ఇంతక్రితంకన్న ఆమె హాయిగా నవ్వుతూంది. ఒకరోజున ఇద్దరూ, గాలి విసురుగా వీస్తుండగా కొండలమీద నడుస్తూన్నప్పుడు, తనబాహువుల్లోకి ఆమెని తీసికొని గుచ్చి ముద్దుపెట్టుకొనేవరకూ అతణ్ణి ఆమె తెగ ఇబ్బందిపెట్టి బాధిస్తూనే వున్నది.

"అదేకదూ! దీనికోసమేనా నువ్వు అడిగేది"

"కాదు! కాదు! అదికాదు" అన్నది కంగారుపడి. అదే వాళ్ళ మొదటిపోట్లాట. స్నేహంగా ఉన్నప్పుడు వాళ్ళెప్పుడూ పోట్లాడుకోలేదు. తరవాత అతనొకసారి ముద్దెట్టుకొన్నప్పటినుంచీ పోట్లాట క్రమేణా ఎక్కువయింది. ఆమెలో ఒక వింతైన నిరాశాభావం —, ఆనందం; — రెండూ. ఆ ఆనందం శారీరకం. ఆ నిరాశాభావం హృదయానిది - ముద్దు పెట్టుకొన్న తర్వాత మళ్ళీ ఆమె ఏకాకిఅయిపోయింది.

ఇద్దరూ పెళ్ళికి నిశ్చయించుకొన్నారు. పెళ్ళి తొందరలో అయిపోతే చాలని ఆమె కొట్టుకుపోయింది. దానికేం పెద్ద కారణంలేదు. పెళ్ళయితే ఒంటరితనం, ముద్దుపెట్టుకొన్న తర్వాత అట్లాంటి నిరాశా అనుభవించక్కరలేదనుకున్నది. అందుకే పెళ్ళిఅయిపోవాలనే తొందర ఆమెకి ... పెళ్ళి ఒక పిచ్చిలా పట్టుకుందామెకి - తండ్రి ఇదంతా చూసి విస్తుపోయి అన్నాడు: "పిల్లా నీసంగీతం ఏంచేస్తావు". అతనికేమీ దీంట్లో సంబంధంలేనట్లు చూసింది.

"మార్టిన్! నాకీ రోజున సంగీతం ఓ లెక్కలోది కాదు. నా కిష్టమైనప్పుడెప్పుడో మళ్ళీ సాధనచేస్తా - అయినా సాధకం మానను-"అంది.

నిజంగా మార్టిన్‌కి సంగీతం అంటే ఇష్టంలేదనేవిషయం పెళ్ళయిన తర్వాతకూడ ఆమెకి సరిగా తెలీనేలేదు. సాయంత్రం అతని పనిసమయం. ఆమె సంగీతంప్రారంభిస్తే ఆపని పూర్తిగా పాడౌతుంది.

"నిజంగా నీకెప్పుడూ సంగీతం ఇష్టంవుండదు" అన్నది.

అతను నోట్లోంచి పైప్ బయటికి తీశాడు. "దాంతో వాయిస్తే నే నాకిష్టం వుండను" అన్నాడు.

"నాసంగీతం నాకెట్లా అనిపిస్తుందో కా స్తంతకూడ నీకు అర్థమైవుండను. నీపని నీకెట్లా అనిపిస్తుందో అది నాకట్లా అనిపించనట్లు. అదే కారణం. అదే నాజీవితం, అదే దానికి అర్థం. అయినా అదివదులుకొని, ఈవిషయం; ఆవిషయం; అన్నీ కూడ కల్పించుకుంటుంటాను. ఇంటిని జాగ్రత్తగా నీకిష్ట మైనపద్ధతిలో దిద్దడం ప్రయత్నించి నేర్చుకుంటా. నీకు లేబొ రేటరీలో సహాయపడే సమయాల్లో ఎట్లా నీకు సహాయపడాలా అని ఆలోచిస్తూంటా ......"

"నువ్వు లేకుండా నేను పనిచేసుకుపోగలను. దయవుంచి మళ్ళీ లేబొరేటరీ దగ్గరకు మాత్రం రాకు. ఇంకా నేనొక్కడనే చేసుకుపోగలను. నీకు అభిమాన మే లేనప్పుడు, నీకిష్ట మే లేనప్పుడు అక్కడికి రావడం దేనికి?"

నిజం ఎందుకు దాచాలి ఆమె? మొదట్లో ఆమే అతని సన్నిధిని కోరింది. అతనితోవుంటే కొంత ఒంటరితనం పోతుం దని ఉద్దేశపడ్డది. పెళ్ళిఅయినతర్వాత కూడ అతనితో ఒంటరి తనాన్నే అనుభవించుతుండడం తెలిసికొని భయపడ్డది. ఇంకా ఎన్నో మాటలుదాని బయటకు రాకుండా కమ్మివేసినాయి.

"అంతకుమించి నీకేమీ అర్థం కాకపోతే మళ్ళీ గుమ్మం ఎక్కను. నువ్వు అన్నావుగా ..."

వారిద్దరి కోపకంఠాల ఆర్భాటం డోర్ బెల్ చటుక్కున మోగింది. ఆమెమాట్లాడడం ఆపేసింది. ఆగంటఅవిరామంగా

మోగడంతో అతను లేవబోయాడు. ఇంతలో అతనికన్న ముందే ఆమె నడచి అతనింకా కుర్చీలోంచి లేవకుండానే, తలుపుదగ్గరకి పరుగెత్తి తలుపు తెరిచింది. టెలిగ్రాఫ్ మెస్సెంజర్. అతనిచ్చిన ఒక కాగితంమీద గబగబా సంతకం పెట్టి ఒక పసుపురంగుకవరు అందుకొన్నది. ఇంతలో మార్టిన్ నెమ్మదిగా ఆమెవెనకనే చేరాడు.

"అదినాకా?" అని అడిగాడు. "కెమిస్ట్రీఅసను బేకర్ దగ్గరనుంచి కబురు వస్తుందనుకుంటున్నాను......"

"కాదు, ఇది నాదే. మాఅమ్మ పోయినప్పటినుంచి నాకు టెలిగ్రామ్వస్తుందనే నమ్మకమే లేదాయె" అని గబగబా కవరుచించి చూసిఅతనికేసి తిరిగి "మార్టిన్...! దాద్ దగ్గర్నుంచి... చాలా జబ్బుగావుందిట" అని గట్టిగా అరిచింది.

* * *

దాంతో వాళ్ళపోట్లాట అప్పుడు పూర్తి కాలేదు. ఏవి ఎట్లావుంటె వాటిని అట్లానే వదిలేసి తనతోకూడ ఆ నిస్సహాయస్థితిలో వున్న ముసిలాణ్ణి ఇంటికి తీసికొద్దామని ఆమె అతని దగ్గరకి బయలుదేరి వెళ్ళింది. చూడగానే ఆ జబ్బుమనిషి ఎందుకో 'దాద్' అని నమ్మలేకపోయింది. అతను నిజంగా దాద్ కాదు. ముసిలాడు 'అతిథిగది' లో సుఖంగా పడుక్కొని వుండగా గదిలో కూర్చుని మార్టిన్తో జరిగినదంతా పూసగుచ్చినట్లు చెప్పింది. ముసిలాడికి, ఆమె ఎన్నో ఉత్తరాలు ఇంతక్రితం రావలసిందని వ్రాసింది. అత నెప్పుడూ అలాగే

వస్తానంటూండేవాడు. చర్చిగోడవల్లో ఒక్కనారికూడ అతను కదలిరాలేదు. అట్లాంటిపరిస్థితిలో తాను తనఇంటికి అతణ్ణి తీసికొస్తానని ఆమెఎన్నడూ కలలోకూడ అనుకోలేదు.

"మార్టిన్! అతనిచేత అక్కడ ఉద్యోగానికి వాళ్ళు రెండునెలల్కితమే రాజీనామా ఇప్పించారట. నాతో అక్కడ ఆవిషయం ఏమీచెప్పలేదు. చెప్పలేనంతగా బాధపడ్డాడు. ఇప్పుడా ఫాదరీఇంట్లో ఒకకుర్రాడున్నాడు. అతనే నన్ను 'డాడ్' ఉంటున్న మిసెస్ విక్సు బోర్డింగ్‌హోమ్‌కు తీసుకెళ్ళాడు. అక్కడ చాలా తక్కువరకం గదిలోనే ఈ రెండునెలలనుంచీ ఉంటున్నాడట...... అంతసేపూ అతను నాతో ఏమీచెప్ప లేదు. అంతజబ్బులోనూ నన్ను చూడగానే' అమ్మో మో' అనుకున్నాడు!" అంది.

ఆమె తన జేబురుమాలు కోసం తడుముకొని అద్దంలో మార్టిన్ ముఖంకేసి చూసింది. అది భోజనానంతర సమయం. అందుచే అతను మరో 'టై' బిగుతుగా ముడివేసుకుంటున్నాడు.

"ఇప్పుడేమీ అతన్నిగురించి బాధపడకు ... క్షేమంగా ఇక్కడ వున్నాడు కదా ప్రస్తుతం - మనం కనిపెట్టి చూస్తూం దాం" అన్నాడు.

ఆమె అతనికేసి జాలిగా చూసి తన తల అతనిభుజంమీద వాల్చింది.

"మనం కనిపెట్టిచూద్దాం. ప్రమాదమైనస్థితే. నాకు బయట పనివుంది. పోతా" అతను వెనక్కితిరిగి వంగి ఆమెను ముద్దు పెట్టుకొని కిందకి దిగి వెళ్ళిపోయాడు. తలుపువేసినచప్పుడు

బలంగా నేలమీద అడుగులధ్వని ప్రతిధ్వనించడం ఆమెవింటూ న్నది. హఠాత్తుగా ఏదో ఒంటరితనంలో పడిపోయినట్లనిపించిం దామెకి. మరణంతో పోరాడే ముసలిరోగితో ఒంటరిగా ఉండడం, ఇంకా ఎన్నో భయంకరమైన విషయాలు ఆమెకు జ్ఞాపకంవచ్చి గజగజలాడిపోయింది. కాసేపటివరకూ తండ్రి పడు కున్న అతిథిగదిలోకి వెళ్ళడానికికూడ ఆమెకు భయంవేసింది. అతను డాడ్‌లా ఆమెకు కనిపించలేదు. ఆకృశించిపోయిన తండ్రి తనను "ఎల్లీ!" అని తెగపిలుస్తున్నాడు. అయినా తనువెళ్ళి అతణ్ణికనిపెట్టుకుండాలి. కొద్దిసేపట్లో డాక్టరు వస్తాడు. మార్టిన్ జాలికలవాడే. అతను ఎన్నిమాటలన్నా క్రియ చేస్తాడు. లేచి గదిలోకి వెళ్ళింది.

* * *

తండ్రి వణుకుతూ కంపితస్వరంతో అన్నాడు: "ఎల్లీ చూడు! ఏవిషయం నేను, అమ్మాయితో చెప్పటల్లేదు... ఆమె బొత్తిగా కుర్రపిల్ల - ఇంకెవరితోనూ చెప్పను—"

'చూశా నాన్నా' అన్నదామె నెమ్మదిగా. రోజూ అట్లానే అంటున్నదామె. రోజూ చెప్పిందే తిరిగి మళ్ళీమళ్ళీ తన కష్ట గాథ అతను చెబుతున్నాడు. మొదట ఒకసారి ఆమె తండ్రిని 'డాడ్' అని పిలిచింది. అప్పుడు ఒక్క-క్షణం ఆమెకేసి వింతగాచూసి బాధపడ్డాడు. తనతల్లి అతణ్ణి "రాబర్టు" అని తప్ప మరోపేరుతో ఎప్పుడూ పిలిచేది కాదని ఆమెకి గుర్తొచ్చి తన తల్లిగా తనని భావించి మాట్లాడుతున్నట్లు తెలిసికొని ఆమె నవ్వింది. ఆమె మరచిపోయి మరోసారి "రాబర్ట్" అని

పిలవలేదు. "అవును నాన్నా" అనేసింది మరచిపోయి మళ్ళీ. కాని అతనిబుద్ధి పరిపరివిధాల పోతున్నది. ఇటీవల ఎప్పుడూ అతనిస్థితి అలాగే వుంటూన్నది. "చూశావా ఎల్లీ. మునుపటికన్న నేను బాగా ముసిలివాడనయిపోయా నను కుంటున్నారు వాళ్లు. నాపుట్టిన రోజు నీకు జ్ఞాపకముండాలే! సెప్టెంబరు 6 వ తారీఖు. 75 ఏళ్ళమనిషి. చర్చిలో పసికి చాలా పెద్దవాడన్నారు వాళ్లు నన్ను. ఇంతకీ చూడు ఎల్లీ! — నాకు 75 ఏళ్లు కాదు. ఇంకా వచ్చే సెప్టెంబరుకు కాని నాకు 75 రాదు అని చెప్పాను వాళ్ళతో". అతను వణుకుతూ పక్కమీద లేచి కూర్చోబోయాడు. 'జోన్సుగారూ మీరు పొరబాటు పడు తున్నారండీ!' అని నేను వాదించాను ఆయనతో అన్నాడు. నీరసంగావున్న అతని కళ్లు శక్తిని పుంజుకుంటున్నవి.

"అవును! అవును నాన్నా!" అన్నది ఆమె ఏడుస్తూ.

"పడుకో చిట్టీ - పడుకొని విశ్రాంతితీసుకో - అయినా నువ్వు ప్రతీది అర్థంచేసుకుంటూ వుండాలి ఎల్లీ..."

"అలాగే చేసికొంటా నాన్నా — అర్థమైంది...నాన్నా... అర్థమైంది..." అని మళ్ళీమళ్ళీ అంటూ అతను నిద్రపోయే వరకూ అనునయిస్తూనే వున్నది.

* * *

తండ్రి నిద్రపోతుంటే అతణ్ణి నర్సునుచూడమనిచెప్పి గది లోకి గబగబా పక్కమీదకి వచ్చి ఏడుపు ప్రారంభించింది. ఆఏడుపువిన్నాడు, ఆమెను చూశాడు మార్టిన్ —

"చాలా దయనీయస్థితిలో వున్నాడు. ఆకొద్దిజీతంతోనూ

వేసవికాలం శీతాకాలం అనే భేదంలేకండా ఒక్క సెలవు కూడ లేకండా నలభై ఏళ్లు పనిచేస్తే చివరకి వాళ్ళే, ఆ మనుష్యులే ఆయన్ని గెంటేశారు మార్టిన్ !"—

"చాలా దారుణం – సిగ్గుపడాల్సినవిషయం" అన్నాడు ఆమెపక్కగా కూర్చుని ఆమెచేతిని తనచేతిలోకి తీసుకొంటూ తనపట్ల ఇటీవలన ఎంతో దయగా ఉంటున్నాడే అనుకొన్నది. అతని బలమైనచేతిని అందుకొంటూ ఆమె. ఆమెను ఇటీవల ఏ విషయంలోనూ అతను అభ్యంతరపెట్టలేదు. ఆమెకు మనసు బాగోక సంగీతం వాయిస్తూంటేకూడ అతనేమీ అనడంలేదు. ఆమె కూడ దానిని మరచిపోతున్నది. అతను గదిలోవుంటే మాట్లాడకండా కూర్చుంటుంది. ఆమెకి 'కాఫీ' విషయం గుర్తుకొచ్చింది. మళ్ళీ అది మరచిపోలేదు. అయినా ఆవిషయాలన్నీ ఇప్పుడు వింతగా, ఏ ప్రాముఖ్యం లేనట్లున్నాయి. పోట్లాడే కోపతత్వం వారిలో ఏమైపోయిందో? ఎందుకో ఆమెకి తన తల్లి జ్ఞాపకంవచ్చి తాను తల్లివలెనే ప్రవర్తిస్తున్నానని, ఎదిరించి వాదించడం తనకు తగ్గిపోయిందనీ, అప్పటి తనతల్లికంటె కూడ సహజమైన ఓరిమితో వుంటున్నానని ఆమె కనిపించింది. అతను పూర్వపు అలవాటుప్రకారం ముందు తలుపుగెంటితే వెంటనే అతనిమీద విరుచుకు పడలేదు. ఆశ్చర్యానికి ఆమెకు చిరాకుకలిగినా ఏమీ మాట్లాడకుండా కూర్చుంది.

వచ్చినప్పటినుంచీ తండ్రినే కనిపెట్టుకొని చూస్తూన్నది. ఇట్లాంటి ఘడియల్లో తనతల్లే వున్నట్లయితే ఎట్లావుండేదో అనుకుంది; ఏమనుకునివుండేదో, చనిపోయే ముసలిభర్తను

ఎట్లా అనుసరించేదో! — నానాటికీ తల్లిలాగే తను కనపడు తున్నది. అది ఒక్క తనకే —

"అతన్నేం కలవరపెట్టకండీ! — ఇక ఎంతో కాలం లేదు — మీా అమ్మ అతనిపక్కనే వున్నట్లు అనుకోనేట్లుగా చూడండి" అన్నాడు డాక్టరు.

అందువల్లనే అతనిని తనభార్యగా ఆమె అనుకోనిస్తూంది.

"నాకు స్వస్థతచిక్కాక మళ్ళీ వెళ్ళిపోతాను. మరో వూరి చర్చికి దరఖాస్తు పెడ్తాను. వాళ్ళు జీతం సరిగా ఇచ్చినా ఇవ్వక పోయినా ఇబ్బంది కలగకుండా వుండే ఒక చిన్నతోట ఉన్న ఇల్లు ఒకటి చూస్తాను. ఇతరులను డబ్బుఅడగడంలో ఎంత ఇబ్బంది, ఆనందం ఉందో ఎరుగుదును. ఆఇబ్బందులు, ఆనం దాలు నీకూ, నీపిల్లకోసం అని నాకనిపించకపోతే నే నెప్పుడూ డబ్బుకోసం వృత్తి చేసేవాణ్ణి కాదు. నేను ఒంటరిగాడినే అయితే ఫలాపేక్ష లేకుండానే చేస్తూందును......" నీరసంగా కునుకుతూ పలికే అతని కంఠం దించుకొనిపోయింది.

ఆరాత్రి ఆమె కోపంగా మార్టిన్‌తో అంది—"నేను అక్కడ నుంచివచ్చిన రెండుసంవత్సరాలనుంచీ మానాన్నకి వాళ్ళు సవ్యంగా జీతమిస్తున్నారనే నమ్మకం నాకులేదు. ఆవేళ వెనక్కి వెళ్ళి కనుక్కొని ఉండవలసింది. ఏం జరుగుతూందో నేను ఊహిం చలేకపోయాను. అతను ఒక్కవిషయమూ నాతో చెప్ప లేదు."

"బహుశా నీకు తెలియడానికి అవకాశం లేదులే" -అన్నాడు మార్టిన్. ఇద్దరూ భోజనంబల్లదగ్గర వున్నారు. అతను కత్తితో రొట్టెను గుచ్చితీసికొంటూ "అయినా

మీనాన్న గతపదేళ్ళలోనూ చర్చిసంఖ్యను పెంచలేక పోయాడని నేను గట్టిగా చెప్పగల్ను" — అన్నాను.

"అదో లెక్క కాదు అతనికి... అతనికి కలవై పశ్య అనుభవం వుంది" అందామె.

"అంత క్షోభపడిపోవడం దేనికి నువ్వు. విషయం అనవసరంగా అధికం చేసుకొని బాధపడతావు. నాకు తెలుసు. ఎప్పుడూ అంతే. అయితే నువ్వెట్లా బాధపడతావో ఏమిటో అంతా నాకు తెలుసు. ప్రతివిషయాన్ని రెండోవైపునుంచి కూడ చూడాలి. వాళ్ళు చేసే సూచనలను గమనించక ఈమునలాడు ఇంకా చాలారోజులు ఆ ఉద్యోగాన్ని అంటిపెట్టుకొని వుండును. అంచేత వాళ్ళు విస్పష్టంగా ఉద్యోగం వదిలేయమని అతనితో చెప్పివుంటారు. ఇప్పుడు చూస్తున్నావా, కలకంటున్నట్లూ అన్యమనస్కంగా ఎట్లావుంటున్నాడో! నే నక్కడున్న వేసవిలో ఆచర్చిస్థితిగతులు ఏమీ బాగున్నట్లు నాకు తోచలేదు. కాని మీనాన్న అదేమీ గుర్తించలేదు —"

"ఏమిటీ?...... ఎందుకు చెప్పలేదు నాతో మరి?"

"అది నాపని కాదు. పైగా నాకీ చర్చిలంటే ఇష్టం వుండదు. ప్రార్థనలూ, బోధలూ చాలాపెద్దవిగా ఉంటున్నట్లు అవైనా సరిగా లేనట్లు — అందువల్ల యువకులు చర్చికి రావడం చాలావరకూ మానుకున్నట్లూ; 'జిమ్' చెపితే విన్నాను"

వింటూ ఆమె ఏమీ మాట్లాడలేదు. అది పూర్తిగా నిజమే కావచ్చుననే దృష్టితో కాదనలేకపోయింది. "అయితే మాఅమ్మ ఎవరో నాన్నెవరో వాళ్ళకి పూర్తిగా తెలిస్తే అట్లా జరగకపోను"— అంది.

"అయితే కావచ్చు. కాని ప్రజలపద్ధతి ఎలావుందో చూడు. ప్రజలనుంచి పెద్దఎత్తున ఏదీ ఆశించడంలో ప్రయోజనంలేదీ రోజుల్లో - ఎవరికైనాసరే సమగ్రమైన జీవితానుభవం ఉండి తీరాలి"—

"ఆచరణ! అనుభవం!" అనుకుంటూ విసురుగా కోపంతో తండ్రిపక్క దగ్గరకి వెళ్ళిపోయిందామె.

ఆరోజు అతని కేమీ బాగోలేదు.

"ఈరాత్రి నేవుండి చూస్తాలే. నువ్వునిద్రపో. ఈరాత్రికి ఇతణ్ణి నేవదలకూడదు" అన్నది ఎలిజబెత్—నర్సుఒప్పుకున్నది.

"అయితే ఇక్కడేవుండాలా" అని అడిగింది విసుగ్గానర్సు —

ఆరాత్రంతా ఆమె ఒకరకమైన మానసిక వ్యగ్రతతో ధ్యానిస్తూ అతని పక్కనే కూర్చున్నది. అతనికి చాలారోజుల నుండి రాత్రులు సరిగా నిద్రలేకపోవడంచేత ఆరాత్రి హాయిగా నిద్రపోయాడు. తనచేతులు రెండూ ఆమెచేతుల్లో పట్టుకో మన్నాడు. అట్లానే చేతులు తనలోకి తీసికొని నిద్రపోతూంటే ఆమెచూస్తూ కూర్చుంది. కంగారుగా ఒకసారిలేచి కాసేపు ఆమె కేసిచూసి బాధతో ఇబ్బందిగా అన్నాడు — "రాత్రేనా ఎల్లీ — నువ్వింకా నిద్రపోలేదేం?"

"లేదు నాన్నా - ఇది మధ్యాహ్నం. ఎండ తగలకుండా తెరలు అడ్డుకట్టాను" అన్నది.

"వద్దమ్మా" అని ప్రారంభించి తిరిగి అతను నిద్ర కుద్యమించాడు.

* * *

ఏవిధంగా చూసినా ఆఇల్లు ఎంతమాత్రం వాళ్ళఇల్లులా ఆమెకి అనిపించడం లేదు. తనకూ మార్టిన్‌కీ సౌఖ్యప్రదంగా చేసిన ఇల్లులా అది ఆమెకు తోచడంలేదు. వాళ్ళకన్న బల వత్తరమైన మరోజీవి దానిని చేజిక్కించుకొన్నట్లుంది. ఆ మరో జీవిపైనే వారిజీవితం ప్రేమ అన్నీ నిలచివున్నాయి.

అంత్యదశ సమీపించే కొద్దీ ఒక్క ఎల్లీ తప్ప ముసలివాణ్ణి అన్నీ వదలిపోయినాయి. అతను నిద్రపోతుంటే ఎలిజబెత్ అక్కడనుంచి వెళ్ళిపోతుంది. మెలకువవచ్చి ఆమెకోసం అరు స్తాడు. వెంటనే ఆమె అతనికోసం ఎల్లీగా (అతనిభార్య) మారి పోవాలి. అతను ఆమె తండ్రికాడు, ఎల్లీ ఆమెకు తల్లి కాదు. వాళ్ళిద్దరూ — ఇద్దరు మనుష్యులు — ఇద్దరు ప్రేమికులు. ఆఇద్దరూ భార్యాభర్తలైనారు. తండ్రి ఆమెకు తనహృద యాన్ని విప్పి ఎన్నో విడమర్చి చెప్పినప్పుడు ఆమెను మధుర మైన మౌనం, వ్రీడ ఆవహించినాయి. ఇప్పు డవన్నీ వదలి పోయినవి. ఇదివరకెప్పుడూ ఆమెతో చెప్పని విషయాలు అతను చెప్పగా తను ఎలిజబెత్‌ను అనే విషయం మరచిపోయి 'ఎల్లీ' అయిపోయేది. ఆమె 'ఎల్లీ' అనేదృష్టితోనే అన్నిసంగతులూ అతను చెప్పేశాడు. తాను విన్న దయనీయమైన రహస్యవిష యాలు ఎక్కడో ఒకచోట చెప్పవలసిన అవసరం కలగడంచేత అన్నీ మార్టిన్‌తోనే చెప్పేసింది.

"మార్టిన్! అతను 'విశ్వాసం' కోసం పోరాడుతున్నాడు. అతనికి దైవంఅంటేకూడ అంతటి విశ్వాసం ఉందని నేను అను కుంటున్నాను. జీవితంలో ఒక విలువైన విషయంకోసం

అతను మిగిలినవన్నీ వదులుకొన్నాడు. కాని అతనికా నమ్మకంలేదు. నేనేంచేసేది ?"

"చేయాల్సిందేమీ లేదు. నిజాన్ని గుర్తించడమే. దృష్టిని కేంద్రీకరించు ఎలిజబెత్ ! మనమూ ఎప్పుడో చావవలసిన వాళ్ళమే. అతని విషయమూ అంతే అని సరిపెట్టుకో" - అన్నాడు మార్టిన్.

ఆమె ఏడుస్తూ తండ్రిని తలుచుకుంది.

మార్టిన్ చెప్పినది తప్పుఅని ఆమె చెప్పలేదు. అతను దయావిహీనుడని అంతకన్న అనలేదు. ఆమె కెన్ని విధాల సహాయపడాలో అన్ని విధాలా అతను సహాయపడుతున్నాడు. నిజమేమో తెలిసికోకుండా ఆ చనిపోయే వృద్ధునికి సహాయపడాలని ఆమె ఎందుకనుకుంటున్నదో అతని కర్థంకాలేదు. ఏది నిజంకాదో దాన్ని నమ్ముతూ అతని కెట్లా సహాయపడడం: చివరకి దాంతోనైనా అతను నిశ్చింతగా ప్రాణం విడుస్తాడనా ! మార్టిన్ నిజంగా దయాస్వభావుడు.

తనబలంకొద్దీ అతి తేలికగా బహుచిత్రంగా పక్కమీద వున్న ముసలిరోగిని అతను మరోపక్కకు ఎత్తిపడుకోబెట్టాడు. ఎప్పుడు మార్టిన్‌ను చూసినా ముసిలాడు కలవరపడుతూ చూసి అడుగుతాడు. "ఎల్లీ ! ఈ కుర్రాడెవరు ?" అని.

"మార్టిన్‌ను నువ్వు మరచిపోయావా నాన్నా ?" నవ్వుతూ అనేది. కాని అతనికి జ్ఞాపకంలేదు.

"అతనే ఎలిజబెత్‌ను పెళ్ళాడింది. తెలుసా ?" అన్నది తిరిగి.

అప్పుడన్నాడు ముసిలాడు : "ఎలిజబెత్ కు పెళ్ళికాలేదు -

పెళ్ళయినట్లయితే ఆమె నాతో చెప్పే వుండును. ఎలిజబెత్ ఇంకా చిన్నపిల్ల..."

అప్పుడతనికి చాలాబాధ కలిగింది. మార్టిన్ ఓదార్పుగా అన్నాడు: "మీపొరుగు డాక్టర్ని నేనే".

ముసిలాడి ముఖం కాస్త తేరుకుంది. నీరసంగా నవ్వి "యువ కుల్ని, చిన్నవాళ్ళని చూస్తే నాకెంతో సరదా. ఎప్పుడూ సాయంత్రం నాగదికి నాలుగు, -ఆరుగంటల మధ్య యువ కులు రావడం నాకెంతో ఆనందం...ఎల్లీ! ఆవిషయం అత నితో చెప్పు......" అన్నాడు. మధ్యలో గొంతు చాలా సార్లు వణికింది. చివర ఆమాటలు తేలిపోయాయి.

"చిత్రం! మనకి పెళ్ళయినట్టుకూడ జ్ఞాపకంలేదు చూడు" అన్నాడు మార్టిన్. ఇద్దరూ నిద్రపోయే అతన్ని కాసేపు నిలబడి చూశారు. తమకు పెళ్ళయినట్లు అతను మరచిపోయా డని తరవాత ఆమె అనుకుంది. మార్టిన్ అక్కడినుంచి వెడుతూ గబుక్కున "ఎలిజబెత్ కు పెళ్ళికాలేదు - ఆమెకి నిజంగా పెళ్ళి కాలేదు" అన్నాడు.

"ఏమిటి? అన్నావు"—అని అడిగింది ఎలిజబెత్. ఆమె ఊపిరి తెగకొట్టుకొంది. అత నేమీ జవాబు ఇవ్వలేదు. ఆమెకు ఏమన్నాడో తెలియనూలేదు.

* * *

అతిత్వరగా ముగిసిపోయిన ఆ చివరిరోజుల్లో అతని కామె పూర్తిగా ఎల్లీ అయిపోయింది. ఆమెను విడిచిపెట్టలేనంత సన్ని హితుడై పోయాడు. అతను తనజీవితంలో ఎక్కడో మిగిలి

వున్న భయాన్ని అతిరహస్యంగా ఆమెతో చెప్పాడు. "ఎల్లీ! అయితే నేనే విధంగా తప్పో? బహుశః దేముడనేవాడు లేక పోవాలి?"–

ఎన్నో ఏళ్ళక్రితం ఆమె తనని తనే ఆప్రశ్న వేసికొంది. అప్పుడేదానికి సమాధానం వచ్చింది. ఈ రెండేళ్లూ మార్టిన్‌తో ఉండకపోతే తన గుడ్డినమ్మకం పూర్తిగా పటాపంచలు కాక పోను. మార్టిన్ లేబరేటరీలో తన 'స్లైడ్సు' చూస్తూ అనే వాడు – "చూశావా పదార్థం దానంతట అది ఎట్లా విభాగ మైపోతోందో! పునః పునః విభజింపబడుతూ జీవులు మర ణిస్తున్నాయి. అందులో ఏమీ అర్థం లేదు. విభాగితమౌతూ చనిపోవడంతప్ప ఏమీఅర్థంలేదు". బహుశః మార్టిన్ చెప్పింది యథార్థం కావచ్చు.

"దేవుడున్నాడు నాకు తెల్సు" అంది నెమ్మదిగా, కంగా రుగా అతని మరణోన్ముఖమైన వదనంకేసి చూస్తూ.

"నమ్మకమేనా? ఎల్లీ!"

"నమ్మకంగానే" అని జవాబిచ్చింది.

"నీకు నమ్మకంకలిగితే ఎల్లీ..." అంటూనే తృప్తిగా నిద్రపోయాడు. ఆ చరమరాత్రి మళ్ళీమళ్ళీ అదేప్రశ్న అతను వేశాడు. ప్రతీప్రశ్నకూ ఆమె జవాబిచ్చింది. అయినా మరచిపోతూనే వున్నాడు. తుదిక్షణాలను గురించిన కించిత్ భీతి తప్ప ఇంక అతనికేమీ గుర్తులేవు.

"నువ్వు నమ్ముతున్నావా ఎల్లీ?"

"నమ్ముతున్నా...నమ్ముతున్నా..."

తన తల్లినోట ఎక్కువగా వినపడే ఆరెండుమాటలు ఆ తుదిక్షణం వరకూ ఆమె అన్నది. ఆ క్షణంవరకూ ఆమాటలు ఏకారణంచేతో ఆమె పలకలేకపోయింది. ఏదో తెలియని సిగ్గు ఆమెలో పనిచేయడంచేత వాటిని ఆమె ఎందుకో చెప్ప లేకపోయింది. ఈక్షణంవరకూ ఆమె రాబర్టు, ఎల్లీల కుమార్తె. కాని తుదిక్షణాన 'ఎల్లీ'యే తిరిగివచ్చి తనసిగ్గులు ఒలికించి నట్లుగా ఆసిగ్గులే పుణికిపుచ్చుకొన్నది.

మెరుపులా, ఒక్కసారి ఉజ్వలంగా తుదిసారి అతను నవ్వాడు.

ఆమూగవోయిన మెరిసిన కళ్ళకేసి చూసి ఏడుస్తూ "రాబర్ట్—రాబర్ట్" అన్నది.

* * *

అంతా అయిపోయింది. మంచి చీకటిలోంచి వెలుగులోకి వచ్చినట్లుంది ఆమెకు. విచారానికేమీ అవకాశంలేదు. చావురాకూడదని కోరడం చాలా అసందర్భం. మామూలుగా సూర్యుని తీక్ష్ణత, వెలుగు ఆమెకు భరించశక్యంకానివైనాయి. ఆమె మార్టిన్ తిరిగి ఒంటరిగాళ్లు. వెచ్చని జ్ఞాపకాల జీవితం గడచిపోయింది. ఆమెలో తల్లి ఎల్లీశక్తి ప్రవేశించింది. కాని ఆమెను శూన్యంచేస్తూ, ఇదివరకటిమనిషిగానే తిరిగి వదిలేస్తూ ఇప్పుడాశక్తి తొలగిపోయింది.

ఆ శూన్యత ఇదివరలో ఒంటరితనంవలె లేదు. వాతావరణం మారింది. ప్రేమ ఎంతోశక్తి సంపన్నమై స్పర్థలను, పోట్లాట లనూ మాయంచేసి ఒక వినూత్న జీవన రంగాన్ని సృజించింది ఆమెకు. ఆమె అంతరంగంలో అదే లీలగా పనిచేస్తున్నది.

అది గుంర్తుచగలిగితే ఆమెకర్థమైనట్లే. శూన్యమైపోయిన ఇంట్లో అటు ఇటూ తిరుగుతూ తనకలవాటులోఉన్న పనులు చేసికొంటూ తల్లితండ్రుల పరస్పర ప్రేమ ; తను చిన్నతనంలో ఎంత గారాబంతో పెరిగిందీ ఆమెజ్ఞాపకంచేసికొంది. తనకు తిండి, గుడ్డ, రక్షణ ఈయడంచేత కామె ఎదగలేదు. వారికి గల పరస్పర ప్రేమలో ఆమె ఆకృతినిదాల్చింది. ఉజ్వలమైన ప్రేమలో ప్రవర్ధమైంది. ఆ కుటుంబంలో అందుకే దారిద్ర్యం అనుభవిస్తున్నామనే ధ్యాసే లేకపోయేది.

తానెప్పుడూ ఒంటరిగా లేదు. తనతల్లిపోయిన తర్వాతకూడ తండ్రి ఒంటరిగాలేడు. ఆమె నిజంగా చనిపోలేదని, జీవితాంతం తనతోనే ఆమె ఉంటుందని అతను అంటుండేవాడు. ఆభౌతిక శరీరం భూశ్శయనమైపోయినా 'ఎల్లి' అతని శరీరంలోని అంత ర్భాగమే. జీవితసంఘర్షణలో నీరసించిపోయినప్పుడు అతని ఆత్మశక్తి ఆమెలో విలీనమైపోయింది.

పువ్వులు సర్దడం ముగించి టేబిల్ మీద సూర్యకాంతిపడే చోట దాన్నిఉంచి, వెళ్ళి కిటికీదగ్గర కూర్చుని మొగ్గలుతొడిగే తోటవంక చూస్తూ ఆలోచనామగ్న మనస్కతలో ఆమె ఒకక్షణం బయటిప్రపంచాన్ని మరచిపోయింది. ఆక్షణికమైన సుఖంనుంచి వేరు కాగానే ఆమెలో ఏదో అభావం గోచరించింది.

తల్లీ తండ్రీ గతించారు. కాని ఆమెమాత్రం మార్టిన్‌తో. ఏకాకిత్వాన్ని అనుభవిస్తున్నది. తండ్రితో గడిపిన ఆకొద్ది వారాల సుఖం ఒక కలలాగ గడిచిపోయింది. కాని నిజంగా

తాను బాహ్యప్రపంచంలో గడిపేది, తనకై మిగిలిన ఒక్క మార్టిన్‌తో. ముసిలాడు చనిపోయినగదిని పూర్తిగా సర్దింది. రంగు తెరలను తీసేసింది. ఫొటోలు, కుర్చీలు, బల్లలుమార్చింది. ప్రస్తుత జీవితంలోనే ఆమెతృప్తిపడగలగాలి — తనకితిరిగిరాని ఆ మరోజీవితం తనకు సంబంధంలేదని ఆమె గుర్తుంచుకొన్నది. ఆ ఇంట్లో మిగిలింది ఆఇద్దరే. చిన్నపనీ, పెద్దపనీ చూసి కొంటూ ఆమె ఆఇంట్లోనే గడుపుతోంది.

* * *

మార్టిన్‌తో ఆమె చాలా సౌమ్యంగా వుంటోంది. నిదానంగా మాట్లాడుతోంది. అతనికిష్టమైనవిషయాల్లోనే ఎక్కువ శ్రమపడుతోంది. అతనూఆమెపట్ల ఎంతో ఉదారంగా ప్రవర్తిస్తూంటే "జీవితాంతం ఇదేవిధంగా ప్రేమతో, దయతో ఇద్దరం బ్రతకచ్చు. ఇన్నిరోజులనుంచీ ఎంతోహాయిగావుంది." అనుకొంది. ఇదివరలోవలె పోట్లాడే అలవాటు పోతే ఒకరితో ఒకరం ఎట్లా గడుపుతామో? అని ఆలోచించింది. తనతండ్రితో తల్లి ఏవిధంగా మెలగిందో తాను బాగా ఇప్పుడు గ్రహించింది కనుక మార్టిన్‌తో తానుకూడ తనతల్లిలా అవగలనా లేదా అని ఆమె నిజాయితీతో ప్రశ్నించుకుంది. తానే 'ఎల్లీ' లా కావాలంటే మార్టిన్‌కి అంతకంటె అధికంగా ఉండాలి. తానెంత దయగా మెలగాలని ప్రయత్నిస్తున్నా, ఒక్క విషయంలో అతనినుంచి విడివడి దూరంగా వుండిపోవాలనే భావం కలుగుతూంటుంది. దానినే ఆమె ప్రవర్ధంకాకుండా నాశంచేయాలి.

ఇప్పుడు అతనినుంచి మరింత దూరమైపోతున్నా ననేవిషయం ఆమె గ్రహించి ఆశ్చర్యపడింది. అతని హస్తస్పర్శనుంచి, ముద్దులలో పరిమళించే సౌరభాన్నుంచి, తనను వెదికే చూపుల నుంచి ఆమె తొలగిపోతున్నది. తానుఅదే చేయకూడదను కొంది. ఆలోచించింది. అతనికేవేవో చెప్పాలని, మరింత సన్నిహితంకావాలని, తనను తెలియచెప్పుకోవాలని ఎంతో ఇబ్బంది పడింది. "మార్టిన్! మనిద్దరం ప్రతిపనీ కలసి చేద్దాం. ఏవిషయాన్నీ దూరం చేసికోవద్దు" - అని ఆమె అతనితో అందామనుకున్నది.

అదే ఆమె అనేద్దామని తయారైంది. తరవాత అతను చెప్పే సమాధానం కోసం ఆగాలి. నిజానికి అప్పుడే హృదయా లను మాటల్లో పలికి, ఒకరినొకరు అర్థంచేసికోగలుగుతారు. అయితే అతను ఒకవేళ "నీ వుద్దేశం నాకేం తెలీటంలేదు, నేనేమీ నీదగ్గర దాచటంలేదు..." అంటే - ?

"మార్టిన్! అదికాదు! దాచడం ఏమీ కాదు! ఒకరి నొకరం విడిపోకుండా వుందామని. కాని నావుద్దేశం... తలుపుకాస్త తెరచి నా దగ్గరకిరా- నీతో కలసి భోజనం చేస్తున్నా నీదగ్గరే పడుకుంటున్నా కూడ నేనెందుకు ఒంటరి తనాన్ని అనుభవిస్తున్నాను?" అని ఆమె అనాలి. అవే మాటలు అనాలని మళ్ళీమళ్ళీ ఆలోచించుకున్నది.

ఆమె అంత ఆలోచించినా కలిగిన లాభమేమీ కనపడ లేదు. చెప్పబోయేసరికి వాటంతట అవి ఇష్టంవచ్చినట్లువచ్చి, బైటపడ్డాయి. ఆమె ఎంత ఆలోచించినా జీవితం దాని గతిలో

అది నడుస్తున్నది. ఒకమంచి సమయం వస్తుంది. అది వచ్చి తీరుతుందని ఆమెకు తెలుసు. తానెంత ఆలోచనలతో ఆసమయాన్ని వాయిదా వేసుకున్నా ఆసమయం విధిగా వచ్చితీరుతుంది. నానాటికీ ఆఇంట్లో ఆజ్ఞాపకం నీరసించిపోతున్నది. రోజురోజుకీ వారి నిజజీవితం బలపడుతున్నది. మరింత సహజంగా అతుక్కుపోతున్నది.

ఒకసారి ఆమె కాఫీకప్పులో చెంచా వేసేముందు ఒక్క-క్షణం అతణ్ణి చూసి తననే అతను కనిపెడుతున్నాడని అనిపించి క్షోభపడ్డది. తనఇష్టంవచ్చినట్టు ఎందుకు చెంచా తిప్పకూడదు? అనుకుంది. అయితే అదేమంత పెద్దవిషయం కాదు. అది తనకిష్టమే అయినా ... ఆచెంచా బలవంతంగా అక్కడ పెట్టేసింది. అతను ఎందుకు దయగా మాట్లాడతాడు? లేబొరేటరీపనితో క్షణం తీరికలేకండా వున్నాడు. ఒకరోజు ఉదయం అతను భోజనంబల్లదగ్గర ఆమెకేసి చూసి అన్నాడు: "లేబొరేటరీలో కంగారుతో నాపని నరకంలా వుంది. అదేదో తేల్చి "రిపోర్టు" శనివారం నాటికి వాళ్ళు అందచేయమన్నారు. నువ్వు కాస్త ఇవాళ అక్కడికొచ్చి సహాయం చేయగలవా?"

"దయవుంచి లేబొరేటరీకిమాత్రం నువ్వు రావద్దు" అన్నా డొకసారి- అది ఆమె ముదలకిద్దా మనుకున్నది. కాని ఆమెపై ఆమెకే అసహ్యం వేసిం దెందుకో.

"వస్తాను" అన్నది. కాని అతను లోగడ అన్నమాట మరచిపోయి వుంటాడు. ఆమధ్యాహ్నం అంతా ఆమె లేబొ

రేటరీలోనే పనిచేసింది. తన అశుభ్రతకు అతను కేకలు పెడితే ఆమె ఏమీ సమాధానం చెప్పలేదు. "నీకు విశ్వాసంలేదు" అందామా అనుకుంది కోపంవచ్చి. నాలికచివరే ఆమాటవుండి పోయింది. దాంతో ఆరోజంతా ఆమెకెంతో చికాకు అనిపించింది. ఆమెలో తిరస్కారం తీవ్రరూపందాల్చ నారంభించింది. ఆ తిరస్కారాన్ని అణిచిపెట్టుకోవడంలో ఆమెకు ఊపిరి రావడం కష్టమైపోయింది. చేతులు వణకనారంభించాయి. కాని ఇంకా ఆమెదానిని వెనక్కి నెట్టుతూనేవుంది. రాబర్టయితే ఎల్లీ అశుభ్రతకి నవ్వేసివుండేవాడు. కొద్దిగా కోపపడినా విశ్రాంతికోసం ఇంటికి పంపివుండేవాడు. అంచేత అప్పుడు ఎల్లీకి ఇట్లాంటి గుడ్డితిరస్కారం, తూష్ణీభావంకలసిన ఆంతరంగిక సంఘర్షణ వుండేవికాదు.

ఆ ఒక్కగంట తట్టుకోలేనంత బాధపడినా ఆమె నానాటికీ మరింత బలపడుతున్నది. దానిని అరికట్టడానికి మరింత కృషి చేస్తున్నది. తరవాత ఒకనాడు తీవ్రమైన సుడిగాలివచ్చి వారిపై ఆగంటప్రభావాన్ని ముందుకు నడిపించింది. ఆతుఫానుకు ఎవరు ఆగగలరు? పెద్దపెట్టుగా ఇంట్లోకి గాలి గెంటుకు వచ్చింది. కిటికీలనుకొట్టి దబదబలాడించింది. శాంతి ఎగిరిపోయింది. ఆగాలికి తట్టుకొని ఎప్పుడు చీకటిపడుతుందా, ఎప్పుడు గాలి తగ్గుతుందా అని రోజంతా ఇంట్లోకూర్చుని చూసిందామె.

చీకటి పడ్డది. గాలి మందగించింది. మళ్ళీ శాంతపడాలంటే ఆమె కేదో వుండాలి. ఏమీఆలోచించకుండా పియానోదగ్గరకు

వెళ్ళింది. ఒకటి రెండుసార్లు 'మెట్లు' సవరించిందో లేదో గాలికి తటాలున గుమ్మంతలుపులు తెరచుకొన్నాయి. గుమ్మంలో మార్టిన్ నిలబడివున్నాడు.

"ఏం గాలో, ఏంరోజో!" అన్న దాతనితో.

కలవరపడే అతనికళ్ళు ఆమెను చూశాయి.

"ఎప్పుడూ గొడవ-గొడవ-గొడవ..." అన్నాడు. గొంతు బిగించినట్లున్నది. అతని కంఠంలో ఏశక్తివున్నదో, ఆమె చేతులు వేలాడిపోయినై.

"ఏమిటి నువ్వనేది...?" అన్నది మాటలు అందక.

"కాస్త నిశ్శబ్దంగా వుండమని" అన్నాడు.

"అయితే సరే" అన్నది అంగీకరించి; పియానోనుంచి చేతులు తీసేసింది. అతను లోపలికొచ్చి నూలబడ్డాడు. కాని ఆమె కూర్చున్న చోటునుంచి లేవలేదు. అలాగే కట్టిపెట్టిన పియానోమీద చేతులుకట్టుకొని ఆమె అక్కడే కూర్చుంది. అతను పాపం బాగా శ్రమపడి వుంటాడని తనలోఅనుకొంది. తను దగ్గరకి వెడితే- అతనికి చీదర; అంచేత ఆమె వెళ్ళదు. అయినా ఏదికావాలన్నా అతనికోసం దగ్గరకువెళ్ళకుండా తను వుండలేనని ఆమెకు తెలుసు.

"ఏమిటిదీ?" అని అడిగా డతడు.

"ఇప్పటితో మన 'రాజీ-నియమం' ఆఖరైంది. అవునా, కాదా? అని గొణిగింది నిస్సహాయంగా.

"అయితే ఏమంటావ్" అన్నాడు జవాబుగా, అగ్గిపుల్ల కోసం వెతుక్కుంటూ.

"చచ్చేంత శ్రమపడ్డాను. మళ్ళీ నువ్వేమీ కొత్త ఇబ్బంది కలిగించవుకదా ?"

అతనికేసి తిరిగిందామె. ఆగంట వాళ్ళిద్దరినీ సన్నిహితం చేసింది. అదే ఘడియకోసం ఆమె ప్రతీక్షిస్తూ వస్తున్నది. ఆరాత్రే ఆమె తలుపుదగ్గరికి పరుగెత్తినప్పుడు మళ్ళీ వాళ్ళిద్దరూ ఎదురుతిరిగారు. కాని ఇదివరలోవలె ఆమె ప్రవర్తించలేదు. ఇప్పుడట్లా పోట్లాడలేదు. ఇప్పుడే కాదు, తనకు తెలిసి వుండగా ఇకముందెప్పుడూ కూడ...

"చూడు ! నీతో ఇక ఎప్పుడూ పోట్లాడను" అన్నాదామె.

"అదేమిటి? ఏంసంగతి?"

"ఏమో, తెలీదు. ఎందుకు మార్టిన్, మన కీపోట్లాట ?" అని మళ్ళీమళ్ళీ ఉద్రేకంగా అందామె. అతను మాట్లాడే ముందే, 'ఎల్లి' కూతురికి చెప్పాలని గదిలోకి వచ్చింది. ఎదురుగా గోడకి తగిలించిన బొమ్మలా గోడమీద ఎల్లి స్పష్టంగా కనిపించింది.

ఒకరోజున, తనకు పదిహేడేళ్ళవయస్సున, తల్లి తండ్రి ఒడిలో ముఖాన్ని దించుకొని వుండగా గదిలోకివెళ్ళి తనుచూసిన సంఘటన ఆమెకు జ్ఞాపకం వచ్చింది. అప్పుడు —

"అమ్మా! ఏమిటే! ఏంచేస్తున్నావే" అడిగింది విస్తుపోతూ. ప్రమాదకరమైన దేదో జరగడం వల్లనే తల్లి విలపిస్తున్నదని అప్పు డామె ఊహించుకొంది. అయితే వెంటనే నవ్వుముఖంతో, రేగిన ఉంగరాలజుత్తుతో వెనక్కి తిరిగి "ఏమీ లేదమ్మా" అన్నది కూతురుతో తల్లి. ఆమెకి

'ఎల్లీ' గొంతు వినిపించింది. ఎల్లీ మెరిసేకళ్ళు కనిపించాయి. అదైనా ఒక్కక్షణంలోనే. ఎల్లీ ఆశించే దేదో చాలాకాలానికి కాని అర్థంకాదు. "మార్టిన్‌కీ ఆమెకీ ఏసంధీ పొసగదు" అన్నది ఎల్లీ. అయినా వాళ్ళిద్దరూ కలసి బ్రతకాలి. రక్తమాంసాలు ఒకరి కొకరికి దూరమైనా సరే, వారిద్దరూ కలసి జీవించాలి. అయినా కొన్ని అవసరాలలో ఒక్కోక్షణంలో గుడ్డిగా, హఠాత్తుగా వారు ప్రేమించుకుంటారు. ఒకరినొకరు ఇష్టపడక పోయినా ప్రేమించుకుంటారు. అగాధమై, అవ్యక్తమైన వారి సహజరహస్య ప్రవృత్తులలో ఇద్దరూ తెలియని శత్రువులు. ఆరాత్రి మార్టిన్ అన్నాడు :

"నేనేంచేసినా నిన్ను తప్పుదారిని నడిపించడానికేనని అని పిస్తుంటుందా నీకు!" అప్పుడు ఎలిజబెత్‌కు జ్ఞాపకంవచ్చి 'ఎల్లీ' అవగతం కావడమారంభించింది. చివరకి అన్నది :

"నీకోటు నేనెప్పుడూ ముద్దెట్టుకోను. ఎప్పుడూకూడా. నాకిష్టం అయేదాకా నేను పెళ్ళాడకుండా వుండాల్సింది..."

"అట్లా చెప్పు - అర్థంచేసుకుంటా" అన్నా డతడు గట్టిగా, ఆమెను చూసి. ఆమాటలతో హఠాత్తుగా నిజం బయట పడ్డది. అది ఇంకెవరో మాట్లాడినట్లు వినిపించింది. అది ఎల్లీ అన్నట్లుగా వినిపించింది. పియానోబల్లవైపు తిరిగి మార్టిన్‌కేసి చూసింది. అతను పొయ్యిప్రక్కన కుర్చీలో ఇమిడికగా కూర్చునివున్నాడు. అలవాటుప్రకారం మాగన్నుగా నిద్ర పట్టిందతనికి. అతని కర్థంఅయేట్లు ఆమె మాట్లాడలేదు. అతను ఆమె అభిప్రాయానికి రానూలేదు. ఆఇద్దరూ మాట్లాడు

కోడానికి ఏవిధమైన ఉపాయాలు, ఉపకరణాలు లేవామె. ఇద్దరికీ సంభావణలేకపోతే ప్రేమావుండదు. ప్రేమలేనేలేదు. అయితే ఇదివరలో ఉభయుల పరస్పర సమాకర్షణ – ప్రేమ స్వరూపాన్ని కూర్చుకొనేందుకు పనిచేసిన ఆ ఆకర్షణ ప్రేమ కాదు – కాబోదు – వాళ్ళిద్దరూ అంత అమాయకంగా ప్రేమించుకొంటున్నట్లు ఆనాడు మోసపోయారు. ఇద్దరూ తెలియకుండా గాయపడ్డారు. ఇద్దరూ తమ తీరని రహస్యమైన కోరికలకు పెళ్ళిద్వారా రూపంకల్పించుకోవాలనే తప్పుదారిలో పడ్డారు. అయితే ఇద్దరూ ఆరూపకల్పనలోనే పరస్పరం పోట్లాడు కున్నారు – హృదయాలు పరస్పరం సంఘర్షణ పొందాయి.

"నన్ను క్షమించు మార్టిన్!... అది ఎంతక్రూరమో అపచారమో నాకింతవరకూ తెలీలేదు ..."

అతను నెమ్మదిగా కళ్లు తెరిచి, ఓపిక తెచ్చుకొని ఆమెకేసి చూడకండానే అన్నాడు: "నాకు విపరీతపుపనులంటే అస హ్యాం. నువ్వెప్పుడూ విపరీతాలు, విచిత్రాలు చేస్తూంటావు. మగవాడు ఇంటికొచ్చి 'గొడవచేయక శాంతంగావుండు' అని చెప్పాల్సిరావడం ఎంత శోచనీయమో ఆలోచించి చూడు"

అతనేం చెబుతాడో అని ఆలోచించకుండానే ఆమె నవ్వే సింది. తాను అతణ్ణిప్రేమించడంలేదనే విషయం నేటికి ఆమెకు తెలిసింది. ఆమె ప్రేమించదు: అతణ్ణి ప్రేమించాల్సిన అవస రము తనకులేదు. తనకేమివ్వగలిగాడని అతణ్ణి ప్రేమించడం? అతను ఆమెను బాధించడు: ఆమెకూ అతణ్ణి బాధపెట్టాలని లేదు. అయితే ఇప్పటికి ఆమెకు తమ మధ్యవున్నది ప్రేమ

కాదని తెలిసింది. బండ, మొండి కుర్రాడు తనతప్పేమిటో తెలియక తిరిగేవాడిమీద తల్లి చూపే ఆప్యాయత, ఆదరణ, ఉరకలు వేసికొంటూ నవనవోన్మేషంగా సాగే అనురాగం – ఆమెకు కలిగాయి. ఏదో ఒకరోజున అతని ఆర్భాటం, భేషజం లేని ప్రవృత్తినే అంగీకరించి శిరసావహించే స్త్రీ కోరి వచ్చి అతనిచేతుల్లో బాధపడుతూనే బ్రతకడంకన్న తన కింకేమీ అక్కరలేదని కోరవచ్చు – అందు కామెకేమీ ఈర్ష్యలేదు. ఇక మిగిలినవేవీ కూడఉండవు. అతను తనకు స్వేచ్ఛనిచ్చినందుకు ఆమె తనకు చేతనైతే అట్లాంటిస్త్రీని వెదికి తేవడంలో కృతజ్ఞతగా సహాయ పడుతుంది కూడా. ఒక్కసారిగా ఆమె హృదయం గంతులువేసింది, స్వేచ్ఛాగీతం పాడుకోవడంకోసం. ఏది ప్రేమకాదో – అదిప్రేమకాదనే యథార్థం ఆమె ఇప్పటికి తెలుసుకొన్నది. ఇక ఎప్పుడూ ఒకరినొకరు బలవంతం చేసికోవలసిన అవసరంలేదు. తా నిక ప్రేమపాశంతో బంధింపబడి లేనని తెలిసికొన్నదానిలా స్వేచ్ఛగా పియానోవైపు తిరిగింది. అటుతిరుగుతూనే ఆగి ఒకసారి అతణ్ణి చూసింది. ఉగ్గబట్టుకొని, నిశ్చలంగా జేబుల్లో చేతులుపెట్టుకొని కూర్చున్నా డతడు. కనురెప్పలు క్రిందికి వాలివున్నాయి. పైప్ పెదవులమధ్య వుంది. అతని చుట్టూ పొగలులేచి తల చుట్టూ ఆవరించినాయి. అతను మౌనంగావున్నాడు. రహస్యంగా నవ్వుకొని ఆమె తిరిగి పియానో మూసేసింది. ఆమె పాట ఆగిపోయింది. మార్టిన్‌ను పాపం అట్లానే మౌనంగా వుండనీయాలి – ఇంక అట్లాంటివాణ్ణి పెళ్ళాడవలసిన అవసరం

ఆమెకి కలగదు—చనిపోయిన 'ఎల్లీ', రాబర్టులు ఇద్దరూ ఆమెతప్పేమిటో చెప్పడానికి మంచిని బోధించడానికి వస్తున్నారు. ఇక మరిపోట్లాడకుండా, అతనంతట అతణ్ణి స్వేచ్ఛగా తిరగనిచ్చి ఒకనాటికి ఆమె ఎంతో ఓర్మితో అతణ్ణి అర్థంచేసికోగలదు. శ్రమనుంచి తేరుకొని, విశ్రాంతితో ఆనందంగా ఉండగా అతణ్ణి చూసినప్పుడే ఆమె సంగీతానికి అవకాశం కలుగుతుంది. సంగీత కల్పనకు ఆమెకింకా జీవితంలో ఎంతో సమయమున్నది. తనస్వీయ సంగీతాన్ని గానం చేయడానికి ఆమెకింకా ఎంతో అవకాశముంది.

---

# కరుగ్గా వుంటే

"ఇక్కడి దర్జీవాళ్ళతో కరుగ్గావుండకపోతే కుదరదు"

తన యింటివరండాలో, పోస్టుమాస్టరుభార్య లోయిా కష్టపడి ఏదోవిధంగా కుర్చీలో సర్దుకుకూర్చుంది. స్థూలకాయం, అదేపనిగా అవసరం లేకపోయినా తింటూవుండడంచేత, శ్రమపడడం ఏమాత్రంలేకపోగా పదేళ్ళయి స్వదేశం వదలి ఓ చైనా రేవుపట్టణంలో నివాసమేర్పరచుకొని వుంటున్నందుచేతా ఆమె ముఖం యెర్రగావుంటుంది. తన కాలర్ కేసి చూసికొంటూ మాట్లాడుతున్నందున ఆమె ఎర్రనికోల ముఖం మరీ యెర్రబడింది. ఆమెదగ్గర నిలబడివున్న ఓ చైనానౌకరు నెమ్మదిగా అన్నాడు:

"దర్జీవాడు వచ్చాడు మిస్సీ"

ఇంటి యజమానురాలికేసి సెబాసు, బాగానేవుందన్నట్లు చూస్తూ న్యూమన్ అనేఅమ్మాయి అన్నది:

"నువ్వూకనక వీళ్ళతో వేగగలుగుతున్నావు. నేనసలు లాభంలేదు." ప్రక్కనే బల్లమిాదున్న తాటాకు విసనకర్ర తీసికొని నెమ్మదిగా విసురుకుంటూ ఏదోఫిర్యాదు చేస్తున్నవిధంగా అన్నది:

"ఈకొత్త గుడ్డలతో అవస్థపడాలి. కొనుక్కోడానికి ఈనాటు (దేశవాళీ) సిల్కు చౌకే గాని కుట్టించడంమాత్రం కష్టంఅవుతోంది. ఈదర్జీవాళ్ళతో పడలేం. మా దర్జీ సరిగ్గా మూడురోజుల్లో బట్టలుకుట్టి పట్టుకొస్తానంటాడు. ఒకటి

రెండు వారాలదాకా కనిపించే కనిపించదు. నాబట్టలు, మరీ అసహ్యంగావున్నాయంటూ రాయన. ఈనాటు దర్జీవాళ్ళతో వేగితే తెలుస్తుంది మీకు అని చెప్పాను. పైగా బట్టంతా తగలేస్తారు. ఆచేతులు కత్తిరించడం అదీను...అబ్బ!" ఆమె క్షీణస్వరం ఓనిట్టూర్పులో కలిసిపోయింది. ఓరెండు క్షణాలు మరీ గబగబా విసురుకున్నది. చేతిరుమాలుతో చెమట తుడిచి వేసికొన్నది.

"ఇప్పుడు చూద్దువుగాని ఏంచేస్తానో" చూసుకో అన్నట్టుగా అంది 'లోయీూ'. గంభీరమైన కంఠం, గుండ్రని కటు దృష్టులు నుదురు చిన్నది, అందిమీాదపడుతున్నట్లు పాయలుగా జుట్టు. నేల కేసి చూస్తున్న నౌకరునుచూసి "ఆదర్జీ నిలా రమ్మను" అన్నది.

సరే నంటూ నౌకరు వెళ్ళిపోయాడు.

ఆ వెంటనే అడుగుల చప్పుడు వినిపించింది. నౌకరూ, అతనివెనకే దర్జీవచ్చారు. అతను పొడుగ్గా — నౌకరుకన్న ఎత్తరిగావుంటాడు నడిమివయస్సు, ఒక విధమైన ప్రశాంతతతో అతని ముఖం ప్రసన్నంగా కనిపిస్తుంది. రంగువెలిసిన బట్టలు— మోచేతులవద్ద చక్కగా మడిచి కుట్టించుకొన్నవి. శుభ్రంగా వున్నాయి. తెల్లని గుడ్డచుట్టబెట్టిన ఓమూట చంకలో వుంది. ఆఇద్దరు ఆడవాళ్ళకూ నమస్కరించి, క్రింద చతికిలబడి మూట ముళ్ళు విప్పుతున్నాడు. అందులో పాతబడిన అమెరికా కంపెనీదేదో 'ఫాషన్‌ల' పుస్తకం,(నమూనా) సగం కుట్టిన నీలిరంగు చుక్కల తెల్లసిల్కు గుడ్డవున్నవి. ఆగౌను

జాగ్రత్తగా విదిల్చి 'లోయీకి' అందించాడు చూడ్డానికి. దాని చుట్టుకొలత, ఆకారం చూస్తే అది ఆమెకోసం కుట్టిందేనని బోధ పడుతుంది. మూతిముడుచుకొని ఆమె దానిని అటూ ఇటూ తిప్పి పరిశీలనగా చూస్తూ ఒక్క పెట్టున గట్టిగా అరిచింది:

“ఈ వట్టి కాలరెందుకూ? అంచు లేసు పెట్టమని చెప్పానుగా; ఇదిగో ఆఫాషను చూడు” లా వాటిఆడవాళ్ళకు ప్రత్యేకించిన ఫ్యాషన్లభాగం గబగబా తీసి “చూడు, ఇదిగో, ఈ ఫ్యాషనే. ఈ వట్టికాలరెందుకు పెట్టాలి? నాకొద్దు తీసుకుపో!

ప్రశాంతంగా వున్న దర్జీ ముఖం చెమట పట్టింది. “సరేనమ్మా” అన్నాడు నెమ్మదిగా కునుకుతూ. కొంచెం ధైర్యం తెచ్చుకొని కాస్త పెదవులు బిగించి, వూపిరితీసికొని తిరిగి అన్నాడు:

“మొదట అంచు లేసు కావాలన్నారు. తరువాత వద్దన్నారు. అంచులేసుదైతే బొత్తిగా బొద్దుగా వుంటుందని, సాదాకాలరు పెట్టమని మొన్న మీరేకదా చెప్పారు!”

ప్రాధేయపడుతూ దొరసాని వైపు చూశాడు. నిండా వుంగరాలు పెట్టుకున్న చేత్తో, పొమ్మన్నట్టు దర్జీని విదిలించి పారవేసి పేముకుర్చీలో జోరుగా ముందుకీ వెనక్కీ వూగుతూ కూర్చుంది. గొంతు పెద్దదిచేసింది:

“ఎందుకీఅబద్ధాలు — నేనేం చెప్పానో నాకుజ్ఞాపకమే! మామూలు సాదాకాలరు పెట్టమని నేనెప్పుడూ చెప్పలేదు — ఇలాంటికాలరు ఆడవాళ్ళెవరయినా పెట్టుకుంటున్నారా? ఫాషనంటూ వేమిటి మరి?”

"సరే. అలాగే కుడతానులెండి. మరేంఇదిలేదు. కాస్త బట్ట ఇప్పించండి" ముఖం వికసింపచేసికొని అన్నాడు. కాని 'లోయీా' అంత సులువుగా శాంతపడే మనిషి కాదు.

"నీదేంపోయింది – అలాగేచేస్తానంటావు – నాగుడ్డ పాడయిపోయింది. బట్టలు ఫ్రీగా వస్తున్నాయనుకుంటున్నావా? డబ్బునష్టమేగా నువ్వుచేసిందంతా" గబగబా ముందుకీ వెనక్కీ ఫ్రూగుతూ విసుకుంటూంటే ఆమె చెక్కిళ్ళు కందినాయి. ఇంటికొచ్చినావిడ కేసి తిరిగి అన్నది: "ఏదో ఈ గౌను తయారవుతుందిగదా అని కూచున్నా–చూడేమయిందో, ఎల్లుండి రాయబార కార్యాలయంలో జరిగేవిందుకు వేసుక వెడదాం కదా అనుకున్నాను. అంచు లేసువెయ్యమని మరీమరీ చెప్పాను – ఆపాడుకాలరుచూడు ఎలాచేసికొచ్చాడో!"

"అదేగా నేనూ ఇప్పుడు అంటున్నది. వీళ్ళతో యెలా వేగుతున్నావో నువ్వు అనుకుంటాను" అన్నది న్యూమన్.

"వేగకపోతే ఎలా" అన్నది మూతివిరిచి అసహ్యంగా. కాసేపు దర్జీపంగతిమరచి తోటవైపు చూసింది. ఓనల్లనికూలీ ఎండలో దారిప్రక్కన మిలమిలలాడే రాళ్ళ అంచుమీాద కూచున్నాడు. చదరంగావున్న పచ్చికబయలులోనికి కాలి బాటొకటి పోతున్నది. ఆమె మౌనముద్ర దాల్చి కూర్చుంది. దర్జీ అస్తిమితంగా నిలుచున్నాడు. సగం కుట్టినబట్ట ఇంకా బుజాననే వ్రేలాడుతూన్నది. చెక్కిళ్ళనుంచి సన్నగా చెమట కారిపోతున్నది. పెదవులు నాలికతో తడుపుకుంటూ గద్గద స్వరంతో అన్నాడు:

"వేసుకొని చూస్తారాండీ!"

"ఎందుకూ! వేసికోవడం ఆకాలాను అదీ అంతా తగుల డింది. ఎందుకో ఇంకా వేసుకుచూడడం?"

అని మళ్ళీ ఏమిూపట్టనట్లు తోటకేసి చూడనారంభించింది.

"సరే మూరన్నట్లే కుట్టుకొస్తాను. ఎప్పటికికావాలండీ?" అన్నాడు దర్జీ ఆతురతగా, ఆమెను సమాధానపరచే ధోరణిలో.

"రేపటికేకావాలి. సర్గ్గా రేపు మధ్యాహ్నం పన్నెండింటికి తీసుకురావాలి. తేకపోయేవో, నీకుకూలికూడ ఇవ్వను. ప్రతిసారీ ఎప్పుడు తెమ్మన్నారని అడగడమే కాని ఒక్కసారీ తెచ్చింది దేదీ?"

"తెస్తానండీ" అని గాను గబగబా, శుభ్రంగా మడతపెడుతున్నాడు. అతని చొక్కాచేతులు అతిసున్నితంగా కదలాడసాగిసై — "తప్పకుండా తెస్తాను - లేసూ అదీ అన్నీ పూర్తి చేసి బాగాచేసి తెస్తాను చూద్దురుగాని."

అతిజాగ్రత్తగా నేలమిూద చతికిలబడి, గాను పరచిన గుడ్డలో కోమలంగా ముడివేశాడు, లోపల ఉన్న గుడ్డలు నలగకుండా. తర్వాత, లేచి ఎందుకోసమో వేచివున్నట్లు నిలబడ్డాడు. ప్రాధేయపూర్వకమైన ఆవేదన ఏదో అతని ముఖంలో గోచరించింది. ఆమూగవేదనలో అతనిహృదయం మునిగిపోయినట్లు (అతని)ముఖంలోని పెద్దచెక్కిళ్లు, బిగుసుకున్న పెదవులూ సూచిస్తున్నవి. క్రొత్తగా పడుతున్న చెమట కాలువలు కడుతున్నది. ఆహృదయం పడుతున్న ప్రాధేయత అంత లావున్నా

'లోయీ'కికూడా కొంత తెలుస్తూనేవుంది. అటూఇటూ ఊగడం క్షణం ఆపి అతన్ని చూచింది:

"ఏమిటది? ఇంకా ఏంకావాలి?" అడిగింది నిశితంగా.

దర్జీ తిరిగీ పెదవులు తడుపుకున్నాడు. క్షీణస్వరంతో గొణుగుతూ అన్నాడు: "కొంచెం డబ్బిస్తారాండీ, ఒకటి రెండు డాలర్లు కావాలండీ!" కోపావేశంలోవున్న ఆమె కళ్ళను చూస్తుంటే అతని గొంతు మరీ దించుకొని పోయింది— "మాతమ్ముడికొడుక్కి వచ్చేపోయే ప్రాణంగా వుంది. వాడికి ముగ్గురు పిల్లలూ భార్యా. శవపేటికకుకూడా డబ్బులేదు. ఈరోజు బ్రతికేటట్టులేదు—"

లోయీ తన కాలర్ వేపు చూసుకుంటూ "ఏమైనాసరే డబ్బుకావాలన్నమాట!" నిజంగానే ఆశ్చర్యపడింది. పక్కనున్న న్యూమన్ వెంటనే అందుకుంది:

"నేచెప్పలేదూ ఇప్పుడు. వీళ్ళతో ఒకటేబాధ. కుట్టు ఆవిధంగా తగలేస్తారా— డబ్బుతప్ప వాళ్ళకి మరోదృష్టే వుండదు."

లోయీ గుడ్లుతిప్పుతూ దర్జీకేసిచూసింది: అతను కళ్ళు పైకెత్తకుండా చొక్కాచేతితో పెదవులు తుడుచుకుంటున్నాడు. ఓక్షణం దర్జీని తేరిపారచూచి ఆగ్రహం వచ్చి అన్నది: "అదేం కుదరదు. నేనుచెప్పినట్టు కుట్టుకురా. అప్పుడిస్తాను. పూర్తిచేసేవరకూ డబ్బులేదు. ఇచ్చి, డబ్బుపట్టికెళ్లు"

"చిత్తం" అన్నాడు నిట్టూరుస్తూ. అతని ముఖంలో కనిపించిన ఏకొంచెము ఆశో ఇప్పుడు పూర్తిగా మాయమై

పోయింది. మామూలు వేదన అంతరించిపోయింది. నిరాశా భావం అతనిముఖంపై తెరలా కమ్ముకున్నది. "రేపు పన్నెండింటికి పూర్తి చేసి తెస్తానండి" అని బయలుదేరాడు.

"తేవాలి మరి" అన్నది విజయగర్వంతో గట్టిగా. అతను వెళ్ళిపోతుంటే అసహ్యించుకొంటూ చూసింది. పక్కనున్నావిడ కేసి తిరిగి అన్నది. "రేపని ఎందుకన్నానంటే, ఎల్లుండికైనా అది తయారుచేసి తెస్తాడని". ఇంతలో ఏదో జ్ఞాపకం వచ్చినట్లుగా కుర్చీ ముందుకు వంగి 'కాలింగ్ బెల్' నొక్కింది. ఓనౌకరు వచ్చాడు. "ఏయ్‌కుర్రాడా! చూడు దర్జీ ఏమైనా పట్టుకుపోతున్నాడేమో."

ఆమె కంఠస్వరం ఇంట్లోకి వ్యాపించింది. హాలు చివర కొద్దిగా కనిపిస్తున్న దర్జీ శరీరం వంగివున్నదల్లా కొంచెం నిటారుగా అయి త్వరగా కనుచూపు దాటి పోయింది.

"వీళ్లు చెప్పేది నిజమో కల్పనో మన కేలా తెలుస్తుంది — ఏమీ చెప్పలేం. వీళ్ళకి అస్తమానూ డబ్బే. ఇంత ఇదయిన వాళ్ళని నేనెక్కడా చూళ్ళేదు. ఈవూళ్లో విదేశస్థులకి బట్టలు కుట్టి బాగా సంపాదిస్తూంటారు వీళ్లు. ఈదర్జీబొత్తిగా అన్యాయం. కుట్టకుండానే కూలడుగుతూవుంటాడెప్పుడూ. ఒకసారి పిల్ల చచ్చిపోతూందనీ, మరోసారి నురేదో కొంపమునుగుతూందనీ చెప్పి మూడుసార్లు వచ్చాడు. వాటిలో ఒక్కటీ నేను నమ్మడంలేదు. భంగుతాగుతాడో, జూదమాడతాడో, వీళ్ళంతా జూదమాడుతూంటారు — వీళ్లు చెప్పే వాటిలో ఒక్కటీ నమ్మలేం."

"ఔను. అంతే" అంటూ న్యూమన్ వెళ్ళడానికని లేచింది. లూయీకూడ లేచింది.

"ఏమైనా కరుగ్గా వుండాలి - లేకపోతే లాభంలేదు" అన్నది తిరిగి.

ఆ ఇంట్లోనుంచి బయటపడిన దర్జీ, మౌనంగా యెండలో పడి గబగబా నడచి వెడుతున్నాడు. తానేమో అడిగాడు. కానీకూడా ఇవ్వలేదామె. మొదట కొంచెం సంకోచించాడు. తరవాత ధైర్యంచేసి ఎలాగో, అడిగినాకూడా ఆమె ఏమీ ఇవ్వలేదు. ఆ అంచు లేసువేసి కుట్టడం మినహా ఇంచుమించు అంతాకుట్టడం పూర్తయింది. రెండురోజులక్రితం ఆమె తనకు సిల్కుగుడ్డ యిచ్చినపుడు తానెంతో సంతోషించాడు, నాలుగు డబ్బులువస్తే తన తమ్ముడికొడుక్కి యివ్వవచ్చునని- తనకొడుకులు ముగ్గురూ పోయినప్పటినుంచీ వాడినే తన కొడుకులా చూసుకొంటున్నాడు. తనకు పుట్టినవాళ్ళందరూ ఒకళ్ళొకళ్ళే పోయారు. వాడే యిక తన కొడుకు. అందుకనే వీణ్ణి చూసుకుంటున్నాడు. తన తమ్ముడు పోయాడు. కొడుకుకు కమ్మరిపని నేర్పించాడు. వాడికే యిప్పుడు ముగ్గురుపిల్లలు. వయసులోవున్న దృఢమైనమనిషి, ఇలా మృత్యువు వాతపడే స్థితికి వస్తాడని యెవరనుకుంటారు? రెండు నెల్లక్రితం నాగటి కర్రుకని ఓ ఇనపముక్కను కాల్చి సమ్మెటతో సాగేస్తుంటే పట్టుకారు పట్టుజారి కాలిమీదపడి మాంసమంతా కాలిపోయింది. అందులోనూ వేసవికాలం, ఆచిన్నదుకాణం వేడితో బొగలు మంటూవుంటుంది. గుడ్డలు సరైనవి లేవు.

ఎన్ని మందులో రాశారు. మాంసం పెరిగేటట్టు చేసే పూత మందు లెక్కకుంటాయి? అందులో అంత పెద్దపుండికి! అదీ కాక వేసవికాలం, ఎక్కడచూసినా ఈగలు జుమ్మని ముసురుతూంటాయి. కాలు బాగా లావుగా వాచిపోయింది. చివరి క్షణాల్లో వున్నాడు. కాలిపోడుక్కి నల్లమలాము (పూత గుడ్డలు అంటించారు - కాని గుణమేమీ కనిపించడంలేదు.

తన తమ్ముడి కొడుకును పొద్దున్నే చూడ్డానికి వెళ్ళాడు. ప్రత్యక్షంగా తనముందు మృత్యువు నడయాడుతున్నట్లు చూశాడు. భార్య చిన్నది. గుమ్మంలో కూర్చుని ఒకటే ఏడుస్తూంది. పెద్దపిల్లలిద్దరూ భయభ్రాంతులై చూస్తున్నారు. మూడో కుర్రాణ్ణి అడ్డాలలో పెట్టుకొని యేడుస్తూంది ఆమె. ఉన్నదొకటే గదామె. చంటివాడు పాలు ఇమడక వాంతిచేసికొంటూ, బాధేమిటో ఊఁ ఏడుస్తాడు. అసలే ఆమె దగ్గర పాలుతక్కువ. ఉన్న కాసిన్ని ఈదుఃఖంతో చెడ్డాయి.

దర్జీపేటలోకి మళ్ళీ ఓవాకిట్లో ప్రవేశించాడు. ఆలోగిట్లో నగ్నంగా పిల్లలు కేకలో అరపుల్తో తన్నుకుంటూ ఆడుకుంటూ వున్నారు. సరిగాసబ్బునీళ్లు చాలీచాలకండా ఏదోరకంగా వుతికిన పాతగుడ్డలుపైన వెదురుకర్రలమీద ఆరవేశారు. గదికొక్కొక్క కుటుంబంవాళ్లు వుంటున్నారు. ఈఇళ్ళ వాళ్ళందరూ చెత్తచెదారం ముందు వాకిట్లోకి తోసేస్తారు. పైగా ఆఇళ్ళలో కుళ్ళు నీరంతా అక్కడే వచ్చిచేరుతుంది. ఎండాకాలమైనా నీళ్ళతో ఆవీధి జారుతూన్నది. ఉచ్చలకంపు.

అతనివేమీ పట్టించుకోలేదు. ఇలాటివే మూడులోగిళ్ళను

దాటి వెళ్ళి కుడివైపునున్న గాలీ వెలుతురూ లేని ఓగదిలోకి వెళ్ళాడు. ఇక్కడ మరోరకమైన వాసనవుంది. చచ్చుబడి కుళ్ళిపోతున్న మాంసపు దుర్వాసన ఇది. తెరవున్న మంచందగ్గర కూర్చుని భార్య ఏడుస్తున్నది. తెల్లావిడ ఇంట్లోవుండగా అతనిముఖం ఎట్లావుండో అలానేవుంది ఇప్పటికీ దర్జీముఖం. దగ్గరకి వెళ్ళి చూశాడు. ఇతడురావడం ఆమెగమనించలేదు. మంచానికి దగ్గరగా నేలమీద కూర్చున్నది. ముఖం కన్నీళ్ళతో తడిసివుంది. ముడివిడిపోయి పొడుగాటి నల్లనితలవెంట్రుకలు ఆమె బుజాలమీదనుండీ నేలమీదకు పరుచుకుని వున్నాయి. ఊఁ ఏడుపుతో మూలుగుతున్నది.

"నన్ను ఒంటిదాన్ని చేసిపోతావా దేముడా? నాగతిం కేంకాను దేముడా?"

పక్కనేవున్న చంటిపిల్ల ఉండీఉండీ ఒక్కొక్కసారి దుర్బలంగా ఏడుస్తూంది. పెద్దపిల్లలిద్దరూ ఆమె చెరుగును గట్టిగా పట్టుకొని చెరొకవేపు కూచున్నారు. అంతవరకూ వాళ్ళూ ఏడుస్తూనే వున్నారు. ఇంతలో తాత రావడంతో ఏడుపు ఆపి తలెత్తి చూశారు.

దర్జీ ఈసారి వారినెవరినీ చూడలేదు. నారతెర తొలగించి మంచంమీదికి వంగిచూచి ఆప్యాయంగా అడిగాడు:

"కులాసాగావుందా నాన్నా?"

మంచంమీదున్న రోగి అతికష్టంమీద కళ్లు తెరిచాడు. చేతులూ, మెడ, ముఖం, శరీరం పైభాగం యావత్తూ బాగా వాచివుంది. కాలినకాలు మరీ విరుద్ధంగా వాచింది. ఆకాలుకి

ఆశరీరం జతచేసినట్లుంది కాని, అది ఆశరీరంలో ఓభాగంగా లేదు. తదేకంగా పెదతండ్రి కేసే చూస్తున్నాడు. పెదవులు తెరచి ఎలాగైతేం విశ్వప్రయత్నంమీద గొణుగుడుగా నెమ్మదిగా అన్నాడు.

"—— ఈ పిల్లలు "

ఆమాటకు దర్జీముఖం బాధతో హఠాత్తుగా ముడివడి పోయింది. పక్కలోకూర్చుని హృదయమిచ్చి మాట్లాడనారం భించాడు:

"పిల్లలను గూర్చి నీవేం దిగులుపెట్టుకోకు. శాంతపడు. నీభార్యా పిల్లలు మాఇంటి దగ్గరుంటారులే. నీపిల్లలు నామనవలేకదా. నేనూ మా ఆవిడా నీభార్యను కూతురిలా చూసుకుంటాం. నీవెలాగూ నాతమ్ముడి కొడుకువేగదా? మాతమ్ముడు పోయాడు. నేనొకణ్ణే మిగిలాను."

ఈమాటలంటుంటే దర్జీకి ఏడుపొచ్చింది. ఈవిధమైన బాధలతోనే కాబోలు అతని నుదుటిమీద అన్నిగీతలు పడ్డాయి. ఇలా ఎప్పుడూ లోలోపల దిగమ్రింగుతున్న దిగులువల్లనే అతని ముఖం ఒకేవిధంగా వుంటుంది. కన్నీళ్లు ఏకధారగా చెక్కిళ్ళనుండి కారుతున్నవి.

కొంచెంసేపు గడిచాక, మళ్ళీ మహాప్రయత్నంమీద రోగి నోరు తెరిచాడు. చెప్పితీరవలసినవి ఇంకావున్నట్టుగా, ఆమబ్బు తెరను ఛేదించుకొని అన్నాడు:

"నీకూ...ఏమీలేదు..."

వెంటనే సమాధానంచెప్పాలని వంగి రోగి ఉబ్బిన కళ్లు

మాతలుపడడంచేత వినబడుతుందో లేదో అని అనుమానిం-
చెవిదగ్గరగా చెప్పనారంభించాడు :

"నువ్వేం బాధపడకు. హాయిగాపడుకో. నాకుకొంచెంపః
వుంది. ఈఇంగ్లీషు ఆడాళ్లున్నారే — రోజూఏదోఒకటి కొత్త
కుట్టించుకుంటూంటారు. పోస్టుమాష్టరుభార్యది ఓ సిల్కు
గౌనుంది—చాలామట్టుకు కుట్టేశాను. కొంచెం అంచులేస
వేయాలి. అదికుట్టేస్తే డబ్బిచ్చేస్తుంది. ఇంకా ఏవైనాతర్వాత
కుట్టడానికివ్వవచ్చు — ఏదోఫరవాలేదు."

రోగి మరి మాట్లాడే ప్రయత్నంఏమీచేయలేదు. పూర్తిగా
స్మృతి తప్పిపోయింది. మరి తెలివిరావడం ఉట్టిది.

అయినా పగలస్తమానూ ఆయాసపడుతూనేవున్నాడు. కొన
ఊపిరితో కొట్టుకుంటూనే వున్నాడు. దర్జీ ఓమాటులేచి, గౌను
మూట మూలపెట్టి తనదుస్తులువదలి తిరిగివచ్చి రోగిపక్కలో
కూర్చున్నాడు. రోజల్లా అలాగేవున్నాడు. రోగిభార్య యేడ్చి
యేడ్చి, అలసిపోయి, మంచంకోడుపై తలఆన్చి కళ్ళుమూసికొని
అప్పుడప్పుడు వెక్కి వెక్కి పడుతూన్నది. పిల్లలకీ ఏడుపులూ,
చావుకబుర్లు మామూలయిపోయాయి. అలావసారాలోకి ఆడు
కునేందుకుపోయారు. పొరుగావిడ ఒకటి ఒకటిరెండుసార్లు వచ్చి
తొంగిచూసి వెళ్ళింది. చివరిసారి క్రిందపడివున్న పసిపాపను
గుండెలకదుముకుని ఓదార్చుతూ తనతో తీసికెళ్ళింది. బయట
ఆమెగొంతుక జాలినిప్రకటిస్తూ బిగ్గరగా వినిపించింది. "ఇవాళో
ఇప్పుడోఅన్నట్లున్నాడు పాపం! నెల్లాళ్ళయిపోయినట్లే అసలు."

ఇలా ఏదోలాగ పగలంతా గడిచింది. చీకటిపడే సమయా
నికి ప్రాణం కాస్తా పోయింది.

అప్పటికి లేచాడు దర్జీ, చొక్కా వేసుకొని - తనమూట తీసికొని, పడివున్న కోడలిని అడిగాడు.

"పోయాడు - నీదగ్గరేమైనా డబ్బుందా?"

అప్పటికామె లేచి ఆందోళనపడుతూ మామవేపు చూస్తూ తలవెంట్రుకలు ముఖంమీదనుంచి వెనక్కు తీసికొంది. వయస్సులో చాలాచిన్నదిగా కనపడుతుంది. ఇరవై ఏళ్ళకు మించి వుండవు. ఏనాడైనా, ఏ వీధినైనా కనిపించే సామాన్యమైన మనిషిలాంటి మనిషే. సుందరీ కాదు, అనాకారీ కాదు, మామూలుగానే శుభ్రంగా వుండదు. ఇప్పుడేమో మరీ చాలా రోజులైంది స్నానం చేసి. ఆమె విషణ్ణవదనం గుండ్రంగా వుంది. కోసునిండుగా కొంచెం ముందుకు వచ్చి వుంటుంది. కళ్ళు ఏమంత స్ఫుటంగా వుండవు. ఇలాంటిదేదో అర్థంతరంగా వచ్చి నెత్తినపడుతుందన్నదే యేనాడూ తెలియకుండా ఆమెరోజులుగడుపుకొస్తున్నట్టు చూస్తేనే తెలుస్తుంది. మామగారికేసి అత్యంత విధేయంగా ఆందోళనపడుతూ చూసి అంది:

"ఏమీ లేదు - ఆయన పడుక్కున్న పక్క తప్ప - మిగిలినవన్నీ - నాబట్టాపాతా, బల్లాకుర్చీలుఅన్నీ తాకట్టుపెట్టేశాము."

అతనిముఖంలో నిరాశ మరింతయింది. "ఇక్కడెవరైనా నీకు అప్పిచ్చే వాళ్ళున్నారా?" అని అడిగాడు.

తలపంకించింది. "ఈ కుటుంబాలవాళ్లు తప్పితే నాకెవరూ తెలియదు. వాళ్ళదగ్గరమాత్రమేముంటుందీ?" తనకిక ప్రపంచంలో దిక్కూ మొక్కూ లేదని అనిపించిందామెకు. బెంబేలుగా ఏడుస్తూ "మావయ్యా, నువ్వుతప్ప మాకింకదిక్కేది" అన్నది.

"మరేం భయం లేదమ్మా" అని మాత్రం అన్నాడు. మరో మాటు మంచం కేసి చూసి, "గుడ్డ కప్పమ్మా. ఈగలు వాలుతున్నాయి" అన్నాడు. అతనుబయటికి నడిచి తొందర తొందరగా వెళ్ళిపోతుంటే చంటిపిల్లను తీసికెళ్ళిన పొరుగావిడ వెనకాలే వెళ్ళి అడిగింది.

"ఇంకాపోలేదా ?"

"పోయాడు" అంటూనే వాకిలిదాటి పడమరగావీధిమళ్ళి తనయింటివేపు వెళ్ళాడు.

ఈవేసవి కాలమంతటికీ ఈఒక్కరోజే మహావేడిగావున్నట్టు తోచిందతనికి. వేసవిమళ్ళుతున్నట్టుండివుండి నిప్పులు చెరుగుతూ వుంది. సాయంత్రంపడినా చల్లగాలి తిరగలేదు. పైగా మబ్బులు దట్టంగాకమ్మినాయి. పైబట్టలుతీసివేసి కొద్దిబట్టలతో ఆడామగా వెదురుమంచాలుబయట వీధిలోవేసుకు ఆపసోపాలు పడుతున్నారు. మరికొందరు వీధుల్లోచాపలుపరుచుకునిపడుకున్నారు. పిల్లలుఏడుస్తున్నారు. ఉక్కపోతకి విసుక్కుంటూ తల్లులు పిల్లలకు విసురుతున్నారు.

తలవంచుకుని ఈజనాభాని తప్పించుకుంటూ దర్జీత్వరత్వరగా వెళుతున్నాడు. ఇప్పుడతను బాగాఅలిసిపోయాడు. ఆరోజల్లా అన్నంతినకపోయినా అతనికాకలిమాత్రంకావటంలేదు. ఇంటికెళ్ళాక భార్య చల్లారినగంజి తనముందుంచినా అతనుముట్టలేదు. తనబట్టలేకో కంపు కొడుతున్నాయి. గబుక్కున సిల్కుగౌను సంగతి గుర్తుకొచ్చిందతనికి. ఒకవేళ ఈవాసన ఆగౌను కంటుకుందేమో ! వాసన గౌనుకు కూడ అంటుకుంటే — ఎలాగ ? తక్షణంలేచి మూటవిప్పి గౌనుతీసి, దులిపిగాలిలో ఆరవేశాడు!

అట్టేసేపు దానిని అలాఉంచడానికి వీలులేదు. కుట్టడంపూర్తి చేసి డబ్బు తెచ్చుకోవాలి. జోళ్లు, మేజోళ్లు తీసేసి, దుస్తులు విప్పి కూర్చున్నాడు. ఉఁ చెమట కారుతున్నది. చెమటపడి సిల్కుబట్ట మరకవుతుందేమో—తలనుంచి చెమట జారి క్రిందపడకుండా వుండేందుకు ఓతువ్వాలు తలకి చుట్టుకున్నాడు. చెమట పట్టే చేతులు తుడుచుకునేందుకని ఓచింకిపాత బల్లమీదుంచుకున్నాడు.

సిల్కుబట్టను సున్నితంగా పట్టుకొని గబగబా కుట్టసాగాడు. ఎంత తొందరపడితేమాత్రం ఏం తెములుతుంది? అవకపోతే ఆమె ఆగ్రహిస్తుంది; అదే ఆలోచించసాగాడు. వెనక తన దగ్గర ఓకుర్రాడు పనినేర్చుకుంటూ వుండేవాడు. మరీరోజులు బాగులేకపోవడంవల్ల వాణ్ణి పంపేసి తనే అన్నీ చూసుకుంటున్నాడు. రోజులు గడ్డుగా వుండడంకాదసలు — ఆకుర్రాడు రోజూ ఎన్నో తప్పులు, వంకర్లు కుట్టేవాడు. ఆతెల్లామె నిత్యం పోరుపెట్టేది; "కుట్టగలిగితే నువ్వు కుట్టు — ఆ కుర్రాడిచేతికిచ్చి బట్టలు పాడుచేయకు." తానొక్కడూ ఈబట్టను ఒక్కచేత్తో మూడురోజుల్లో ఎలాకుట్టగలడు? ఇదిచేస్తే, ఆమె మరో సిల్కుగౌను కుట్టడాని కివ్వవచ్చు — ఈ రెంటికీ పది డాలర్లు వస్తాయి. దాంతో, మిగిలింది తర్వాత ఇస్తానని చెప్పి తను ఓ 'శవపేటిక' ను కొనవచ్చును.

ఒకవేళ ఆమె మళ్ళీ కుట్టడానికి ఏమీ ఇవ్వకపోతే — తనేంచేయాలి? చేసేదేముంటుంది; ఎక్కువ వడ్డీ ఇస్తానని ఎక్కడినుంచో అప్పు తేవాలి. అయినా అతనికెందుకో ఇష్టం

లేకపోయింది. అప్పుకెడితే, తనపని అయిందన్నమాటే. వడ్డీ అసలుకు మూడునాలుగింతలై మీదపడుతుంది. ఈకొడుక్కి కర్మచేశాక కోడల్నీ ముగ్గురుపిల్లల్నీ యింటికి తీసుకురావాలి. అందరూవచ్చినా ఉన్నదీ గది ఒక్కటే. పిల్లలసంగతి వచ్చే సరికి అతనిగుండె పులకించింది. తనొక్కడే వాళ్ళందర్నీ పోషించాలనే ఆలోచనవచ్చేసరికి హడలుతో ఆగిపోయింది.

ఎక్కువగా పని చూసుకోవాలి. ఫరవాలేదు పనిదొరక్క పోదు — తప్పకుండా దొరుకుతుంది. సందేహంలేదు. పోస్టు మాష్టరుభార్య విధిగా రేపు తనకి మరోసిల్కు గౌను కుట్ట డానికిస్తుంది. గొప్పింటావిడ, పెద్దపువ్వులతోట, విదేశీబంగా ళాలో వుంటోంది; తప్పకుండా ఇస్తుంది.

అర్ధరాత్రయినా అతనికి పనిపూర్తవలేదు. అసలున్న కష్టమంతా ముందేవుంది; ఇంకా అంచులేసు కుట్టడం కానే లేదు. ఫాషన్ల పుస్తకంతెచ్చి కిరసనాయిల గుడ్డిదీపందగ్గర కళ్ళుతీసికొని ఏవేవో చూడనారంభించాడు. చూస్తూనే గబ గబా చిన్నచిన్న మడతలుపెడుతూ కుట్టసాగాడు. కుడు తూంటే నీరసంవల్ల వేళ్ళు వణికినై. భార్య పక్కమీద గుర్రు పెడుతూ నిద్రబోతున్నది. తను, కుడుతున్న కుట్టుమిషన్ చేసే చప్పుడు, ఏమీకూడ ఆమెనిద్రకు భంగం కాలేదు. మడతలు ఎలాగో మిషన్మీదే కుట్టాడు. చివర్లు మిగిలివున్నాయి. ఇస్త్రీపెట్టి కాలేయాలి. కళ్ళు పడిపోతున్నాయి. కాసేపు పడుక్కునిలేచి పూర్తిచేసికోవచ్చు. గౌను బల్లమీదపెట్టి, లేచి భార్యపక్కనే వెళ్ళి పడుక్కున్నాడు. వెంటనే నిద్రపట్టింది.

అక్కసేపు పడుకోక్కలేదు. ఏడింటికే లేచి పనిలోకూర్చు
న్నాడు. మధ్యలో ఓసారి అన్నంతినడానికి మాత్రంలేచి మళ్ళీ
పనిలోకూర్చుని మధ్యాహ్నంలోగా ఎలాగైతేం పూర్తి
చేశాడు. అంతక్రితంరాత్రికూడ అతను ఏమీ తినలేదాయె.
ఏమైతేం పూర్తయింది. ఇంతసేపు పడుతుందనుకోలేదసలు.
పొద్దుచూశాడు. ఇప్పుడు బయలుదేరితే అన్న ప్రకారం వెళ్ళ
గలడు. తొందరగా వెళ్ళాలి. లేకపోతే కోపంవచ్చి, ఇంకో
గౌను కుట్టడానికి ఇవ్వకపోవచ్చు. "ఏదోవిధంగా మరో
గౌనుకు బట్ట పట్టుకొస్తే, ఈమధ్యాహ్నం, రాత్రీ కష్టపడితే-
ఒక్కరోజులో అయిపోతుంది.' కుట్టినగౌనుతీసి ఓసారి వాసన
చూశాడు. కొంచెం ఏదో వాసనఉన్నట్టవుంది—ఆమె పసి
కడుతుందేమో ?

అదృష్టవశాన ఆమెకు ఏవాసనా వెయ్యలేదు. వరండాలోని
ఆ చిత్రమైన వూగే కుర్చీలో కూర్చునివున్నదామె. గౌను
చాలా పరీక్షగా చూసింది.

"పూర్తయిందా ?" బిగ్గరగా, అతితొందరగా అడిగింది.

"అయిందండి" వినయంగా నెమ్మదిగా అన్నాడు.

"సరే. వేసుకు చూస్తాను."

ఆమె గదిలోకి వెళ్ళింది. అతను ఊపిరి బిగపట్టుకొని నిలు
చున్నాడు. ఇంకా కొంచెం వాసనఉందేమో దాన్ని ? కాని
గౌను తొడుక్కొని సంతృప్తిగా బయటకువచ్చింది కాని అది
కనపరచలేదు.

"ఎంతిమ్మన్నావ్ ?" తక్షణం అడిగింది.

అతను కొంచెం తటపటాయించి అన్నాడు: "అయిదు డాలర్లండి." ఆమెకళ్ళల్లోకోపంచూసి గబగబా అన్నాడు: "సిల్కుగౌనుకు అయిదుడాలర్లేనండి — ఎవరుకుట్టినా అంతే తీసికొంటారు."

"అంతెందుకోయ్ — అంతగుడ్డ పాడుచేశావ్ కూడాను." ఏమైతేం అయిదుడాలర్లూ అయిష్టంగానే ఇచ్చింది. అతను ఆమెచేయి ఏమాత్రం తగలకుండా జాగ్రత్తగా ఆడబ్బు తీసికొన్నాడు. "ఏదో మీదయ" అంటూ గొంతుకూర్చుని మూటకట్టుకుంటున్నాడు. వేళ్ళు అదేపనిగా వణకసాగినై. ఇప్పుడే అడిగెయ్యాలి. ఎలాగ అడగడం? ఇవ్వనంటే ఏంచెయ్యాలి? తనధైర్యమంతా కూడగట్టుకున్నాడు. ఇంక ఏమైనా తప్పదన్నట్లు;

"ఇంకోగౌనుకూడ ఉంటే ఇవ్వండి. కుడతాను" ఎంతో విధేయతగా, ఆమెకేసి చూడకుండా అన్నాడు. జవాబుకోసమని ఆశపడి అలాగేనిలబడ్డాడు తోటకేసిచూస్తూ. గౌనుతీసేద్దామని గదిలోకి వెళ్ళడానికని ఆమె లేచింది. వెళుతూ అన్నది:

"ఇంకిచ్చేదిలేదు. చాలా ఇబ్బందిపెట్టావు. గుడ్డా పాడు చేశావు. ఇంతకు తక్కువకే గొడవలేకండా కుట్టేవాళ్ళు బోలెడుమంది వున్నారు."

ఆమర్నాడు తోటవిందులో మళ్ళీ, న్యూమన్ అనే అమ్మాయి కనిపించింది ఆమెకు. న్యూమన్ విందుకు వచ్చిన తెల్లాడాళ్ళను విలాసంగా పరికిస్తుండగా ఈమెకన్పించింది. 'లోయీూ' వేసుకొన్న కొత్తగౌను చూడగానే ఆమెకళ్లు విప్పారినై.

"ఏమైతేం సాధించావు. వస్తుందనుకోలే దసలు నేను. లేసు బాగాకట్టాడుకదూ — ఏం?"

లోయిా తన విశాలమైన వక్షంకేసి చూచుకున్నది. కట్టిన లేసుచక్కగా మడతలుమడతలుగా నున్నగా ఇస్త్రీచేయడంచేత నిగనిగలాడుతున్నది. చాలాసంతృప్తిపడి అన్నది – "బాగుంది కదూ? ఇంతకూ లేసువేసికుట్టమని చెప్పడం మంచిదే అయిందన్నమాట. పైగా చాలా చవకకూడాను. ఈలేసూ, గౌనూ నూ: త్రంకుట్టుకూలి అంతాకలిపి అయిదుడాలర్లే. అంటే మన దేశంలోకన్న రెండు డాలర్లకూ ఇంకాతక్కువే. తెలుసా? నేచెప్పినట్టే సరిగ్గా పన్నెండంటే పన్నెండింటికే తీసికొచ్చాడు. ఈనాటుసరుకు దగ్గర కరుగ్గావుంటే తప్ప పని చేయించలేం."

---

# కలహం

భార్య, భర్త పోట్లాడుకుంటూ వీధిని పడ్డారు. వాళ్ళిద్దరి చుట్టూ ఇరుగూపొరుగూ ఓ ముప్పై నలభై మందిదాకా ఆడా మగా, సంగతేమిటో తెలుసుకోవాలనే తహతహతో చేరి నిల్చున్నారు. తమచుట్టూమూగిన గుంపుకేసి అతను కోపంగా చూశాడు. చిన్నపిల్లలు కూడ ఆగోడవేమిటో చూడాలని నిలబడిన పెద్దవాళ్ళను తప్పించుకొని పోట్లాడుకొనే భార్యా భర్తల ముందుకువచ్చారు. అతను 'భర్త' ఏక్చే భార్యవైపు చూడక, ముందుకొచ్చిన తనఇద్దరు పిల్లలనూ చూశాడు. సంగతేమిటో తెలియక వాళ్ళు తండ్రివైపూ తల్లివైపూ విచిత్రంగా చూస్తున్నారు

ఈగోడవంతా అతను సహించలేకపోయాడు. భార్యకన్నీళ్ళని, ఆమెలోదాగిన కోపాలనీ, ఆమెనోట ఇంకా ఉచ్చరించబడని అనుమానాలనీ, గడిచిన పాడురోజుల్నీ తీవ్రంగా తిట్టి బలంగా ఊపిరిపీల్చి మూడోకొంపుకుకేసి ఛీత్కారంగాచూసి ఒక్కగదుము గదిమాడు —

"వెధవాయ్! ఇంటికిపో!"

దాంతో ఆక్రోడు ఏడుపు లంకించుకొని, తన గుండుతల మీద చేతినిరాసుకుంటూ ఆచుట్టూ చేరిన గుంపునుంచి సాను భూతి లభించగలదనే ఆశతో అలాగే నిలబడిపోయాడు. భార్య దీర్ఘాలుతీస్తూ మధ్య మధ్య స్వరస్థాయిని హెచ్చిస్తూ కన్నీళ్ళతో తడిసిన ముఖంతో "ఎలావుందో చూడండివరస!

ఈమధ్య ఈయన అంతా ఇదేతంతు" అన్నది. గుంపంతా అతన్ని నిశ్శబ్దంగా తేరిపార చూశారు. చెప్పినదంతా వాళ్లు విన్నారు. ఆమె వాదాన్నీ అతని నసుగుళ్ళనీ విన్నారు. తనను గురించి అక్కడున్న వారందరికీ ఉన్న అయిష్టం, అసమ్మతి వాతావరణాన్ని బట్టి అతనికర్థ మయింది. వాళ్ళకేసి ఓసారి చూసికొని క్రింద దుమ్ములో వేళ్ళను ముందుకీ వెనక్కీ విసర నారంభించాడు. వెంటనే అతనికి తను నీరుపెట్టవలసిన పొలాలు గుర్తొచ్చాయి.

"పొలంలో నాకు బోలెడు పనివుంది. ఈమధ్యాహ్నం అంతా ఇక్కడ అనవసరంగా తగలేశాను" అని నీల్గాడు. పొలం పోవాలనే ఆలోచన అతనిలో ఒక్కక్షణం తీవ్రంగా పనిచేసింది. ఆ ఆలోచనతో అతని మోసే నల్లని గుండ్రమైన ముఖంలో గూబలవద్ద నరాలు పొంగినాయి. తలెత్తి భార్యను తీక్షణంగా చూసి గట్టిగా అన్నాడు :

"ఏంకావాలో చెబితే పొలంపోతాను! నీకూ, నీపిల్లలకీ ఎక్కడనించి తెచ్చిపోషించను ?"

"మాశారా ఎలావుందో! ఎలామాట్లాడుతున్నారో చూడండి. రెండునెల్ల క్రితంవరకూ ఎంతోమంచిమనిషి. పపూర్వపుణ్యాంవల్లో ఇంతదయగలవారిని దేముడిచ్చాడని మునుపు మీాతో అనేదాన్నా కాదా! గడించిన ప్రతిపైసా ఎప్పుడూ నాచేతిలోనే పెట్టేవారు. ఎక్కడికైనా విందులకి వెళ్ళేముందు క్షౌరంచేయించుకోవాలన్నా, ఓచిన్న పొగాకు ముక్కకొనుక్కోవాలన్నా చిన్నపిల్లాడిలావచ్చి నన్నుఅడిగేవారు ఆయన

ఆనందంకోసం లేపనకుండా ఇచ్చేదాన్ని. ఈరెండునెల్లనుంచీ ఒక్కకాసకూడ కంటచూసి ఎరగను. చివరకి ఇంట్లో నిలవ చేసికొన్న బియ్యపుగింజలు కూడ అమ్మేశారు. అవి అమ్మితే ఎంతవచ్చిందీకూడా నాతో చెప్పలేదు!” అన్నది ఆమె ఏడుస్తూ. ఆమె ఏడుపు మరింత హెచ్చింది. ఆమె ముఖంలో కన్నీళ్ళు ధారకట్టినాయి. నీలంగుడ్డతీసి ముఖంకప్పుకొని మరింత పెద్దపెట్టున శోకాలు ఆరంభించింది. గుమిగూడిన జనం నిశ్శబ్దంగా అలానే వున్నారు. పిల్లలు ఆశ్చర్యంగా నిలబడి చూస్తున్నారు. చిన్నపిల్లలు వాళ్ళమ్మదగ్గరకు పాకి వెళ్ళి ఆమె నీలంగుడ్డలో ముఖంకప్పుకొని వాళ్ళూ ఏడుపు ప్రారంభించారు. ఆఏడుపులాతూంటే అతను యథాలాపంగా దగ్గరలోనున్న ఒకగుమ్మంకేసి చూశాడు.

ఆగుమ్మంలో ఓపాతికగాటి అమ్మాయి నిలబడి వుంది. పట్నాలలో యువతులు ధరించే ఆకుపచ్చరంగు దుస్తులు ధరించింది. జుత్తు మెడవరకూ కత్తిరించబడివుంది. ముఖం అందంగా చలాకీగావుంది. ఈపోట్లాట వింటూ ఆమె చిరునవ్వు నవ్వింది. ద్వారబంధాన్ని ఆనుకొని విలాసంగా అతనికేసి చూసింది. అతడూ ఆమెకేసి చూడగానే ఒక గుండ్రని దువ్వెనతో జుత్తు దువ్వుకో నారంభించింది. ఆమె కనుబొమలు చక్కగా తీర్చినట్లున్నాయి.

అటునుంచి చూపు మళ్ళించుకొని అతను తిరిగి అన్నాడు:

“అస్తమానూ డబ్బోడబ్బో అంటూ పోరడం నాకేం అర్థం కాకుండా వుంది. ఇంట్లో బియ్యం, పిండీ, చిక్కుడునూనె వున్నాయి. తోటలో క్యాబేజీవుంది.”

ముఖాన్ని కప్పుకొన్న అతుకులగుడ్డను తొలగించి ప్రకృతి స్థై పునంగింది. ఆమెలో రేగిన కోపంతో కన్నీళ్లు ఇగిరిపోయాయి. చేతులు మోకాళ్ళ మీద వేసికొని అన్నది :

"తిండీ గుడ్డా రెండూ కూడానా ఈ బ్రతుక్కి! పిల్లల చెప్పులు పోయాయి ఇలాచూడండి మీరు, — ఈతో ముక్కున్న కోటుకి ఎన్ని అతుకులున్నాయో. కొత్తగుడ్డలు మళ్ళీకళ్ళ చూశానా? మూడేళ్ళక్రితం ఆకంపెనీలో వచ్చిన పది వెండి నాణాలతో చవకరకం ముతకగుడ్డ రెండుతానులు తీసికొన్నారు. ఈ చేత్తోనే ఈముదుకు నీలంరంగు వేశాను. ఆయన కోరెండు సూట్లు, నాకొకటి, పెద్దకుర్రాడికొకటి అయాయి. అవే అతుకు మీద అతుకు వేసి కట్టుకొంటున్నాం. ఇంక అతుకులేం వెయ్యాల? దానికైనా గుడ్డముక్కలుండొద్దూ? నా కాళ్ళకు చెప్పుల్లేవు. కుర్రాళ్ళకు మళ్లే నేనూ చెప్పులేకుండా ఎలాతిరగను? ఇవాళపొద్దున్న చెప్పులు కొనుక్కోడానికి డబ్బు అడిగాను. తిట్టారు, కొట్టారు. ఇంకా ఆకోపం తగ్గలేదు. ఈపూటకి ఇక ఇంటికిరారు. వెళ్ళి ఎక్కడో కాస్త రొట్టె కొనుక్కుని తింటారు. ఇంట్లో ఆయన కోసం చేసినవన్నీ పాడవాల్సిందే! తనదగ్గరరాగిడబ్బైనా కూడాలేదంటున్నారు. అయితేం నామీద కోపం తీర్చుకోడానికి రొట్టెకొనుక్కుని తినగలరు."

ఆమెకు కోపం ఇంకా ఆగలేదు.

"కొత్తకొత్తరకాలు. ఎన్నో ఆడాళ్ళు ముద్దైనగుడ్డలు కట్టుకుంటున్నారు. అవి కొనమనికూడ నేనెప్పుడూ అడగలేదు. మాకు కుట్టించడమంటేనే కష్టంకాని మరొకత్తికి కుట్టిస్తారు, కట్టుకొన్న పెళ్ళానికి కుట్టించలేరు!"

దానితో అతను ముండిపడి ముందుకు లంఘించాడు. మూగిన గుంపులోంచి ముందుకొచ్చి కొందరు కొట్టబోయే అతని రెక్కలుపట్టుకు ఆపారు. కొందరు ఆడవాళ్ళు అతని భార్యను వెనక్కితీశారు. అతన్ని ఆపిన వారిలో ఒకడు నెమ్మదిగా అతనితో అన్నాడు:

"ఎవరనుకుంటున్నావ్! పెళ్ళాన్ని అలాకొట్టుకుంటూరా?" క్షీణస్వరంలో ఆమె ఏడవనారంభించింది. అప్పుడే వెనకనించి ఓగొంతు వినిపించింది. ఆగుంపుకి దూరంగా కూర్చునివుందో ముసలమ్మ. గొడవపడుతున్న ఇద్దరినీ ఒక్కకేక వేసింది.

"ఏమిటీ కుర్రతనం! అబ్బాయ్, నలభై అయిదేళ్ళు నెత్తికొచ్చి? నువ్వుపుట్టినప్పుడు నేను మీ అమ్మదగ్గరే వున్నాను. మీపుట్టుకలు నేను బాగాఎరుగుదు. నీపెళ్ళానికి నలభైనాలుగు. నాకదీ బాగాజ్ఞాపకంవుంది. మీపెళ్ళికి నేనూ వచ్చాను. మీనాన్నదగ్గరకెళ్ళి కుర్చీ తేవడంలో ఆవేళ చెయ్యందిచ్చాను దానికి. మీపెళ్ళయి ఇరవై ఎనిమిదేళ్ళయింది. నీకుపుట్టిన పన్నెండుమందిలో ఏడుగురు దక్కలేదు. మీపెద్దకుర్రాడు బ్రతికుంటే ఈపాటికి ఇరవై ఏడేళ్ళుండును. మనవల్నెత్తుదువు. ఈ చిన్నపిల్లకి మూడేళ్ళేకదూ! ఇవన్నీ ఆలోచించు. ఇన్నాళ్ళూ ఏగొడవా గోలా లేకుండావున్నారు. ఇద్దరూ సౌఖ్యంగా బ్రతకండి!"

వణుకుతున్నా స్ఫుటంగా వుంది ముసలమ్మకంఠం. ఆమె ఆగ్రామంలో వయస్సులో అందరికంటే పెద్దదవడం, డబ్బుగలవాడి తల్లిఅవడంచేత అక్కడివాళ్ళంతా ఆమెను గౌరవి

స్తారు. ఆమె మాట్లాడినప్పుడు వాళ్ళంతా జాగ్రత్తగా విన్నారు. ముసలమ్మ కేసి తిరిగి ఆమె అంది:

"మామ్మా! మా ఆయన చాలా దయకలవారనీ, మంచివారనీ నేనెప్పుడూ నీతో అంటుంటాను కాదా! ఇప్పుడు ఎలా ప్రారంభించారో చూడు. రెండు నెల్ల క్రితం దాకా బాగానే వుంది?" అంటూ ఆమె అతని కేసి చూసింది. గుమిగూడిన వాళ్ళంతా అనవసరంగా పోకపోరి చూశారు. అతని ముఖంలోని రంగు క్రమంగా అంతరించి పోయింది.

"నాకు మామ్మా! ఎలా చూస్తారో! ఎట్లాంటి మనిషి? ఇప్పుడస్తమానూ కోపం, ధూర్తు! బయట అంకరిలోనూ చిల్లో, పొల్లో మంటూంటారు. ఇంటికొచ్చేసరికే వస్తుంది, ముఖం అదోలా పెట్టుకొని మాటా మంతీ ఆడరు. ఉత్సాహంగా, సంతోషంగా ఒక్క మాటవుండదు. నన్ను తిట్టడం తప్ప సవ్యంగా ఒక్క విషయం మాట్లాడరు. నా జుత్తు సరిగా దువ్వుకోలేదనో, నా కోటు శుభ్రంగా లేదనో, నాలో ఏదో లోపం కనిపిస్తుంది. నాకున్న దల్లా ఈ ఒంటినున్న ఒక్కకోకే. శుభ్రంగా ఎలా వుంటుంది చెప్పు? ఇల్లూ, పిల్లలూ పొలంలో, పని. మిగిలినవాళ్ళలా ఒంటిని పొడరు, తలకి వాసననూనె రాసుకుని పనీ పాటా లేకుండా కూర్చోవడం నాకెల్లాకుదురుతుంది చెప్పు?"

ఆమాటలు అతను సహించ లేకపోయాడు.

"ఈగోల కేంగాని నీ కేం కావాలో ఏడవకూడదూ" అతను రెట్టించాడు.

"మీ మంచే నేనుకోరేది. రెండు నెల్ల క్రితం నేనంటే ఎలా

వుండేవారో, ఎప్పుడూఅలాగేవుండమని. అదేనాకు కావాలి. మీామనస్సు మారిపోయింది. మునపటిలాగే మమ్మల్ని చూడమని!"

చేతులుచాచి దీనంగా ఏడుస్తూ అనే ఆమె మాటలకు చూట్టూచేరిన జనంనుంచి ఒక్కనిశ్వాసం వెలువడ్డది. రెండు, మూడుసార్లు అతను తొందరగా పెదవులు నాలికతో తడిచేసి కొన్నాడు. నల్లనిజుత్తులోంచి చిన్న చిన్న ప్రవాహాలుగా చెమట కారుతున్నది. అయిష్టంగానే దగ్గరగావున్న గుమ్మంలో నిలబడ్డ ఆఅమ్మాయికేసి మళ్ళీచూశాడు. ఆమెముఖం బాగా కన పడాలంటే అతను వంచుకున్నతల పూర్తిగా ఎత్తాలి. ఆ పిల్ల ముఖం అతనుబాగా ఎరుగును. తెల్లని ఒళ్ళు. సదా నవ్వుతూండే ఎఱ్ఱనిపెదవులు. తననుంచి తప్పుకోని భయంలేని నల్లని కళ్ళు — అన్నీ అతనికి జ్ఞాపకం. ఆగుమ్మం ముందునుంచి వెళ్ళేటప్పుడల్లా ఆచూపులే అతన్ని నిలబెట్టేస్తాయి. ఆమె చూపులకోసమే అతను ఎప్పుడూ ఆదారిని వెడుతున్నాడు. అయితేం ఆమెతోఎప్పుడూ అతనుమాట్లాడలేదు. ఆగ్రామంలో కల్లా ఒళ్ళుబలిసినవాడి మనవరాలామె. తానేమో కౌలుకు తీసికొన్నభూములు తప్ప సొంతం ఒక్కసెంటు భూమికూడ లేని బీదకాపు. తానామెతో మాట్లాడడానికి ఎట్లాతగుతాడు? ఈరెండునెల్లనించీ, అందరూ కుట్టించుకునే పొడుగాటి నీలం నూలుగౌను, పట్నంలో తయారైన తెల్లమేజోళ్ళు, చెప్పుల జతకోసం అతను చచ్చిచెడి డబ్బుదాస్తున్నాడు. తనదాపరి కాన్ని గురించిన ఆలోచన వచ్చేసరికి అతని మనస్సు ఎదు

రుగా ఏడుస్తున్న భార్యమీదకుపోయింది. తనేమో ఇన్నేళ్ళ నుంచి భార్యకు అనుకూలంగానే వున్నాడు. తనకి నలభై ఐదే ళ్ళున్నాయి. ఇంతవరకూ తనకినచ్చిన ఏకోరికా అనుభవించ లేదు. ఎంతదరిద్రుడైనా కాస్తడబ్బుదాచుకొని జీవితంలో ఒక్కసారైనా ఆనందంగా భోగంకొంపకు పోయివస్తాడే! ఆఖరికి అదైనా తను ఎరగడు. ఈనలభైఐదేళ్ళూ పెళ్ళాం పిల్లలకోసం రెక్కలు ముక్కలు చేసికొన్నాడు. మిగిలినదల్లా ఒంటిని ఈఒక్కపాతగుడ్డ. ఇంకేమీలేవు. తను ఇన్నాళ్ళూ చచ్చి చెమటోడ్చితే మిగిలింది ఈ ఒక్క అతుకులపాతగుడ్డ!

అయితేం అతన్ని ఒక్కటే విషయం బాధిస్తున్నది. ఆ గుమ్మంలో నిలబడ్డ ఆ అమ్మాయి కలువరేకుల్లా కళ్ళు విప్పు కొని తడుముళ్ళాడుతూ దారేపోయే అందరివైపూ అట్లానే చూస్తుందా! లేక తననొక్కడినే చూస్తోందా? ఇన్నాళ్ళ నుంచీ ఆ ఒక్కసందేహమే అతన్ని పొగలూరాత్రీ ఏమీ తోచకుండా చేస్తూంది. ఆమె తనకేసి అలా ఊరికే చూడడం వల్ల ఏమిటి? ఆగుమ్మం ముందునుంచి వెళ్ళే ప్రతీసారీ అతను తనచూపును ఆమెమీద విసురుతాడు. మళ్ళీ ఆ అమ్మాయి స్వేచ్ఛగా ధైర్యంగా తనచూపులు అతనిమీదకు త్రిప్పడం జరుగుతూంది. లోకంలో ఆడవాళ్ళ ప్రవర్తన మారిపోయిం దనీ, మగవాళ్ళ మాటను లెక్కచేయడం పోతోందని, తమ కిష్టంవచ్చినవాడిని పెళ్ళిచేసికొంటున్నారని, ఒరితెగించిపోయా రని, చాలామంది మగవాళ్ళు అనుకోవడం అతను చాలాసార్లు విన్నాడు. ఆపిల్ల అందరికేసీ అట్లానే చూస్తుందని తనకెలా

తెలుస్తుంది? తనఒక్కడికోసమే దాచివుంచిందా? ఏమైనా అందులో అంతరార్థంఏమిటో తెలుసుకోవాలి అని నిశ్చయించుకుని పెదవులు తడిచేసికొన్నాడు. చెమట మెడక్రిందికి కారింది.

"నన్ను మునపటిలాగే చూడండి!" అని గోణిగి గుడ్డ అంచుతో కళ్ళు తుడుచుకుంది. ఆమెకు కోపం పూర్తిగా పోయింది. బాధమాత్రమే మిగిలివుంది.

హఠాత్తుగా తలఎత్తి ఆపిల్ల నిలబడ్డ గుమ్మంకేసి పూర్తిగా ముఖంతిప్పి చూశాడు. ఆపిల్ల చూపులు తనకోసమోకాదో తెలుసుకోవాలిగదా!

అతను అటు చూడడంతో ఆగుంపు గుంపంతా అటే చూశారు. ఆ అమ్మాయి గుమ్మంలోనిలబడి అట్లానే చూస్తోంది. తెల్లని చిన్న కొమ్ముదువ్వెన్న చేతిలో వుంది. నెమ్మదిగా దువ్వెన్న జుత్తులోకిపోనిచ్చి చెవులవెనక్కి జుత్తును దువ్వ నారంభించింది. చెవులకు బంగారు దుద్దులున్నాయి. ఏమిటో అని అతనిభార్య కూడ అటే చూసింది. "అదిగో మగవాళ్ళు వేసికొనేలాంటిగాను!" అన్నది ఒకస్త్రీ అనుకోకుండా. ఆగుంపులోని వారంతా ఆశ్చర్యంగా చూస్తున్నారు.

ఆగుంపు చివరగల ముసలమ్మ ఇంత మందీ అటే చూడడంతో ఆశ్చర్యంగా ఏమిటోఅని ఆవైపే చూసింది. ఆపిల్లెవరు? ఇంకెవరు... తనపెద్దమనవరాలే. కొంటెరకం, పట్నంపద్ధతులతోపాడైంది. ఆపిల్లకిక పెళ్ళీకాదనీ, పిల్లపాడై పోయిందనీ ఆముసలమ్మ తనకొడుకుతో ఎన్నిసార్లు చెప్పలేదు? పెళ్ళికొడుకును నిశ్చయించుకో బోయినప్పుడు ఆకుగ్రాణ్ణే మున

లమ్మ తనలో జాలిదల్చింది. ఇటీవల మనవరాలిని మరింత జాగ్రత్తగా కనిపెడు తున్నది ముసలమ్మ. ఆపిల్ల చిలిపిముఖం ఆగుంపులోని ఎవరివైపో తిరగడం ముసలమ్మకనిపెట్టింది. చూడగానే ముసలమ్మ ముడతలుపడ్డ చెక్కిళ్ళలో ఎరుపురంగు కమ్ముకుంది. ఆగుమ్మంకేసి చేతికర్రను గట్టిగా చప్పుడయేలా నేలనుకొడుతూ పిల్లచూసేవైపుచూసింది. ఇంతసేపూ ఆపిల్ల దగ్గరలో ఒకగుమ్మంలో నిలబడియున్న ఒకయువకుని కేసి చూస్తున్నది. ఆకుర్రాడు మొదట ఆపోట్లాట వింటూ ఆగుంపులోనే వున్నాడు. కాని తరవాత ఆపిల్లకేసిచూస్తూ నడ్డిని గుంపువైపుత్రిప్పి నిలబడ్డాడు. అతనికళ్ళు సిగ్గుతో మిలమిల లాడాయి. పెదవి పట్టుతప్పినందువల్ల నీరు నోటిలోంచి బయటకు రాబోయింది.

తన మనవరాలు అదేపనిగా ఆకుర్రాడికేసి చూస్తూండడంచూసి ముసలమ్మ తన చేతికఱ్ఱను అక్కడ రాళ్ళమీద గట్టిగా కొట్టింది. ముసలమ్మ ఆ అబ్బాయిని ఎరుగును. సత్రవు గుమాస్తా కొడుకు, భూమీపుత్రా లేదు.

“ఇంట్లోకి పో — సిగ్గులేనిదానా! పాడుపిల్ల!” ముసలమ్మ ఒక్కకేక పెట్టింది. ఆమెగొంతు వార్ధక్యంచేత వణుకుతూ చెదిరినట్లున్నా అందులో హుందా, ఆగ్రహం స్ఫుటంగానే పలుకుతున్నాయి. ఆ కేకకి ఆపిల్లకాస్త నసుగుతూ కాస్త పక్కకు తప్పుకుంది.

“ఇంట్లోకి పోమ్మంటుంటే వినబడడంలేదూ?” తన చేతి కర్రను కోపంతో ఆమెవైపు ఊపుతూ మరోకేక పెట్టింది,

దాంతో ఆపిల్ల నెమ్మదిగా గుమ్మం తలుపు నీడలోకి జారుకుంది. కాని ఆమె చెయ్యి మాత్రం ఇంకా తలుపుమీద నే వుంది. ఆచేతి చిన్నవ్రేలిని బంగారపుటుంగరం వుంది. ఆ వేలినికూడా ముసలమ్మ అకణ్ణించి తప్పించింది.

"ఇలాంటి పిల్లను నేనెక్కడా చూళ్ళేదబ్బా! ప్రధానం అయినపిల్ల గుమ్మంలోనిలబడి దారేపోయే ప్రతివాళ్ళకేసీచూడ్డమా? అందుకే అంతా అనుకుంటున్నారు. ఇక ఈప్రపంచం ఏమౌతుందో నాకు అంతు పట్టటంలేదు" అన్నది ముసలమ్మ గట్టిగా. గుమిగూడిన ప్రజల్లో పోట్లాటయందు ఉత్సాహం నీరసించింది. అతనిభార్య కొంత తృప్తిపడి చిరునవ్వు నవ్వింది. అక్కడో చిన్నకుర్రాడు ఏడుపు ప్రారంభించటంతో ఆజనం కాస్త కదిలి ఎక్కడివాళ్ళక్కడకు పోతున్నారు. ఇంకా ఆసత్రవుగుమస్తాకొడుకు, ఆపిల్ల అంతసేపూ నిలబడ్డ గుమ్మం కేసే ఆశగా చూస్తూ నిలుచునివున్నాడు. పోట్లాడుకున్న భార్యభర్తకూడా ఆగుమ్మంకేసే చూస్తూ నిలబడ్డారు. అతనికప్పటికి ఆ పిల్లనిగూర్చి సందేహనివృత్తి అయింది.

ముసలమ్మ మాట్లాడవలసింది ఇంకా పూర్తికాలేదు. ఒక్కసారి ఆమెకంతా అర్థమైంది. అతనికేసి తన చేతికర్రను చూపి అన్నది.

"నువ్వు బొత్తిగా తెలివితక్కువవాడివోయ్! సంపాదించిన డబ్బేదో మీఆవిడచేతి కిచ్చేయి. పోలంపో!" అన్నది తేల్చివేస్తూ.

అతగాడు నెమ్మదిగా తన తోలుపటకా లోంచి నాలుగు వెండినాణాలు పైకితీసి చేతిని ముందుకు చాచాడు. అతనికి భార్యచేయి తగిలింది. తనచేతిలోనున్న వెండితో అందిమీద పెట్టుకొన్న కలలతోసహా భార్యచేతిలో వదిలాడు. చెదిరిపోతున్న జనంకేసి తీవ్రంగా చూసి అన్నాడు:

"ఎందుకో ఇంతరభస అర్థంకాదు. డబ్బుకావాలని చెప్పడానికి ఇంతగొడవా! అది చెప్పినట్టు వెనక నాదగ్గరున్నదల్లా దానికే ఇచ్చేసేవాణ్ణి" అని అంతకుముందు క్రిందపడేసిన గడ్డపార మళ్ళీ పైకెత్తి భుజానవేసికొని మళ్ళీ తనపనిలోకి తల వెనక్కితిప్పకుండా ముందుకు నడిచాడు.

---

# మాతృ వర్షీయసి

ముసిలమ్మ, — కొడుకు, కోడలు, ఇద్దరు పిల్లలతో భోజనం బల్లదగ్గర కూర్చుంది. ఆమధ్యాహ్న భోజనం పెద్దపనిమనిషి వడ్డిస్తూంది. ముసలమ్మ నిశ్శబ్దంగా చేతులుకట్టుకొని ఒదిగి, ఒక్కొక్క వంటకమే బల్లదగ్గరకు వస్తూంటే వాటిని ఎప్పుడు నోట్లో పారేసుకుందామా ఒక్కసారిగా అన్నట్టు నకనకలాడి పోతూ కూర్చుంది. అందులో ఆమెకు బాగా ప్రీతైన పదార్థ మొకటి వుంది. అయినా ఏమీ మాట్లాడకండా కూచుంది అది తనకోసం వండలేదని ఆమెఎరుగును. మరచిపోయివండి వుంటారు. ఆమె కిష్టమైనవంటకాలు — పల్లెటూరి దరిద్రపు తిళ్ళు అని, అవి తాము తినమని, అప్పుడప్పుడు కొడుకూ కోడలూ అంటుంటారు. అంచేతనే ఆమెకిష్టమైన పదార్థాలు అక్కడలేవు ఆరోజుకూడా.

కాని ఆవంటకంకేసి చూసేసరికి ఆమె నోరూరింది. ఆకలి అధికమైంది. తనముందుపెట్టిన గిన్నెడుఅన్నంమీద మిరియా లలోంచి తనతినేగరిటెతో ఇంతతీసికొని పోగుపెట్టుకోవాలని ఆమెకనిపించింది. కాని అట్లాటి పనులు చేయకూడదని ఒక ప్పుడు హెచ్చరించారు కొడుకూ కోడలూను. కొడుకు — కోడలితో కలసివుంటున్న ఈనాలుగుసంవత్సరాలనుంచీ ముసి లమ్మకు చాలావిషయాలు తెలిశాయి. అన్నిపదార్థాలూ బల్లదగ్గరకొచ్చాక కోడలు "నీకు కావల్సినవేవో తీసుకో" అని అనేవరకూ ఆమె ఓపికగా కనిపెట్టుకు కూర్చోవాలి.

ముసిలమ్మకేసి కోడలు గిన్నెలు ఒక్కటొక్కటే గెంటుతూ, అందరూ తినవలసిన పెద్దగిన్నెలోని పదార్థాలలో ముసిలమ్మ ఎంగిలిచేసిన గరిటెముంచుతుందేమో అని ఒకసారి నిశితంగా ఆమెకేసిచూసి ఆగిన్నెల్లో ఎక్కువగరిటెలు ఉన్నాయనిగట్టిగా తెలిసేలా చూపించింది. 'ఆపని చేయకూడదు,' అని ముసిలమ్మకు తెలియడానికి చాలాకాలం పట్టింది. ఎవరికి కావలసింది వాళ్లు, తినేగరిటెలతో, పెద్దగిన్నెలోంచి కావలసినంత తీసికోవడం — ఆమె జీవితంలో రైతుకూతురుగా, రైతుభార్యగా ఆ పని మూర్ఖపుపని అనిగాని, అసందర్భపు పని అనిగాని ఆవిడ కెప్పుడూతట్టలేదు. అది కూడనిపనిగా తనకొడుకూ కోడలూ భావించడమే ఆవిడకు తెలియడానికి అవకాశంకలుగుత. కొడుకూ కోడలూ విదేశంనుంచి తిరిగివచ్చిన మొదటిరోజునే ముసిలమ్మ నెమ్మదిగా తన తినేగరిటె, పెదవులమధ్య పెట్టుకొని తుడిచి దాన్నే ఇంకో గిన్నెలో, అంతా వేసికోవాల్సిన పదార్థంలో, ముంచినప్పుడు ఆఇద్దరూ ఆమెమీద మండిపడ్డారు. నిజానికి ఆప్రాంతంలో మనుష్యులు నాగరికతలేక అట్లాంటి రోత అలవాట్లతోనే వుంటారు.

ఆరోజున ముసలమ్మ వాళ్ల గద్దింపు విని ఉలిక్కిపడ్డది. తినేగరిటె గిన్నెమీదే వదిలేసింది. ఆవంటకంలో ఏతల వెంట్రుకో, గుడ్డపీలికో, పుల్లముక్కో — ఎంతఅనుభవంగల వంట వాళ్ళయినా తెలియకుండానే అట్లాంటివి పడుతుంటాయని, అవేమైనా అందులోప్రత్యక్షమైనాయేమో అనుకుని ముసలమ్మ అన్నది "ఏం! ఏమిటి?" అని కొడుకు కోపపడ్డాడు.

"నోట్లో పెట్టుకున్న గరిటె మళ్ళీ అందులో పెట్టకు. ఇంకో గరిటె తీసుకో."

ఆవిడకు పట్టలేని కోపంవచ్చింది. ఆపుకోలేక అన్నదికదా:

"నాదగ్గర ఏవైనా అంటువ్యాధులున్నాయా! ఎందుకంత భయం?"

ఏవేవో కంటికికూడ కనిపించనంతటి చిన్నచిన్న క్రిములు ఒకరిదగ్గరనుంచి ఇంకొకరి కంటుకొని జబ్బులు తెస్తాయని వాళ్లు ఆమెకి వివరిస్తూంటే బింకంగాతనకు ఏమాత్రం అందులో నమ్మకంలేనట్లు కూర్చుని వాళ్ళ కడ్డంవచ్చి అన్న దామె:

"అట్లాంటివి నాదగ్గరవున్నాయంటే నాకు ఏమీ నమ్మకం లేదు. అలాంటి క్రిములు నాఒంటిమీద నేనెప్పుడూ చూడలేదు. అవి కనబడలేదు" —

"అయ్యో! కళ్ళకి కనబడనంత చిన్న వవి" అని వాళ్ళంటే "మీాకూ కనిపించనప్పుడు అవినాదగ్గరే వున్నాయని మీాకెట్లా తెలుసు?" అన్నది గుబుక్కున ముసిలమ్మ పాపం! అదే తనకు ఘనవిజయం అనుకుందామె. అయితే కొడుకు తండ్రిమోస్తరుగా ఖచ్చితంగా అన్నాడు:

"ఈవిషయం నీతో వాదించి లాభంలేదమ్మా. ఇట్లాంటి కూడనిపనులు నాఇంట్లో జరగడానికి వీల్లేదు. నాఇంట్లో అవి కూడనివి!" —

ఆమాటకి ముసిలిది బాగా దెబ్బతింది. మరి మాట్లాడకుండా ఒక్కఅన్నం మినహా మిగిలిన మాంసం, కాయగూరలు వున్న గిన్నెల్లోవి ఇష్టంవచ్చినట్లు తీసికోడానికి బాధపడుతూ, పడు

తూనే ఉండిఉండి కాస్తకాస్త తీసికొంటూ కూర్చుంది. బతు కంతా ఆవిడకి తిండిధ్యాసే - రుచులమీద చపలత్వం. ఇప్పుడు వార్ధక్యం రావడంతో భోజనమే ఆవిడకు మరింత మక్కువ అయింది.

ఇట్లాగే ఒకసారి తాను చేస్తే కోడలు ఏంచేసిందీ ముసలమ్మ చూసింది. అందు కావిషయంలో ఆమె ఒప్పుకుతీరాలి. ఒక రోజు రాత్రి భోజనంబల్లమీదికి వంటకత్తె ముసలమ్మ. ప్రీతైన దోసపచ్చడిగిన్నె తెచ్చిపెట్టింది. చూడగానే ఆవిడకి ఆనందం ఆగింది కాదు. ఇక సర్వం మరచిపోయి పింగాణీ చెంచాతో అందులో కాస్తపచ్చడి తీసికొని రుచిచూసి ఇంకొంచెం తినడానికి మళ్ళీ ఆ చంచా అందులో ముంచిందికి ఛరాలున కుర్చీలోంచి కోడలులేచి ఆపచ్చడంతా ఆపక్కనే కిటికీలోంచి తోటలోకి పారబోసి వచ్చింది. కమ్మనిపచ్చడి అట్లా వ్యర్థం అయింది !

“ఏం !ఎందుకూ?” అనినిర్ఘాంతపోయి అడిగింది ముసలమ్మ.

కోడలుపెదవులుగట్టిగా బిగించింది. అయినా నెమ్మదిగానే “నువ్వు తిన్నతర్వాత మాకు కతికేఖర్మ ఏంలేదు” అంది.

దాంతో ముసలమ్మకు మండిపోయింది. కొత్తలో ఆమె కోపగించడానికి ఏమాత్రం వెనుదీసేదికాదు. “మీకేమీ విషంపెట్టనులే - అంతవరకూ నమ్మకంగా చెప్పగలను” అన్నది బిగ్గరగా.

కోడలు ఆమెను ఎత్తిపొడిచే ధోరణిలో “నువ్వు ఒక్క టూత్ బ్రష్ కూడావాడవ్ !” అంది.

దానికి ముసిలమ్మ సగర్వంగా "చిన్నప్పటినుంచీ ఎట్లా-కడుగుతున్నానో నోరు అట్లానే తోముకుని కడుక్కుంటాను. ఉదయంలేవగానే, భోజనం తర్వాత - కాని మాకాలంలో అంతకన్న ఎక్కువగా ఎవరూ తోముకోలేదు" - దాంతో కొడుకు అందుకున్నాడు:

"మీకాలంలోనా! మీకాలాన్ని గురించి నీకిష్టమైనట్టు మాట్లాడకు. మన దేశం మిగతా దేశాల్లోకల్లా బాగా నాగరికంగా ఉండాలంటే నీబోటివాళ్ళంతా ముందు మారాలి."

ఆధోరణిలో మాట్లాడే కొడుకువుద్దేశమేమిటో ముసిలమ్మకి తెలియదు. అతనట్లా అంటూవుంటే మొదట పల్లెటూరిదానిలా బిగ్గరగా నవ్వేదామె. అతను మాట్లాడుతుంటే ఎవడో కుర్రాడు తనకర్థంకాకపోయినా ఎక్కడో విన్న పెద్ద మాటల్ని తిరిగి వాడుతున్నట్లు ఆమె కనిపించేది. తనపైన కొడుకు చూపే ఓరిమీ, తను నవ్వినప్పుడు అతను చూపే సౌమ్యతా, ఆఇంటికొచ్చే అతిథులు అతనిపట్ల చూపేగౌరవమూ, ముసిలమ్మ చూసిచూసి తనకి తెలియకుండానే నవ్వడం మానేసింది. చుట్టూ నవ్వూ, తుళ్ళూ లేని ముఖాలుండగా ఏమనిషికైనా ఒంటరిగా నవ్వుకోవడం ఎలాసాధ్యమవుతుందీ?

అయితే, నిశ్శబ్దంగా అల్లరిలేకండా కూర్చుని భోజనంచేయడం, వడ్డన పూర్తి అయేవరకూ తినకుండా కూర్చోడం మొత్తంమీద ముసిలమ్మ నేర్చుకుంది. ఆనేర్చుకున్నదే ఇప్పుడామె చేసింది. తనగిన్నెడు అన్నం తిని నెమ్మదిగాలేచి

హాల్లోంచి నడచి తనగదిలోకి వెళ్ళిపోతూ ద్వారబంధం దగ్గర ఒక్కక్షణం ఆగింది ముసిలమ్మ. నిజానికి ఇంకా ఆవిడకి ఆకలి తీరలేదు. పొలంపని చూసికొనేరోజుల్లో రోజూఆమె మూడుగిన్నెల అన్నంతినేది. కడుపునిండీనిండని ఒక్క గిన్నెడన్నంతో ఆమె ఆకలి ఏంతీరుతుంది? అవైనా పెద్దగిన్నెలుకావు. పట్నవాసంవాళ్ళుపయోగించే నాజూకైన చిన్నగిన్నెలు ఇప్పు డింట్లోవాడేవి. ఇంకా ఆకలి కరకర మంటూనే వుంది. కావలసినంతా తినడానికి ఆమెకి వీలేదీ? కొడుకు విసుగుగా అంటుంటాడు: "కాయకష్టంచేసే మోటు మనిషిలా తింటావు. ఇంత 'ఆబ' తిండితినే ఆడదాన్ని నేనెక్కడా ఎరగను. ఇంతాతిని నువ్వేంపనిచేయాలి?"

అయితే అతను ఆమె తినడాన్ని అరికట్టలేదు. అది ఆమె ఎరుగును. ఇదివరలో తల్లీతండ్రీ సంవత్సరంఅంతా కష్టించి సంపాదించే డబ్బుకన్న ఎక్కువగా మేష్టరీఉద్యోగంలో అత నిప్పుడు ప్రతినెలా సంపాదిస్తూ కూడ ఎట్లా అరికట్టగలడు? అరికట్టలేడు. ఆమెవుండడంచేత ఎందుకో అతను బిడియపడుతు న్నాడు. తనవల్లనే అతను నవ్వులపాలు కావలసివస్తూందని ఆమెకీ తెలుసు. అతిధులు ఇంటికి వచ్చినప్పుడు, ఆమెగదిలోనే ఆమె భోజనం ఏర్పాట్లు చేయ నిచ్చినందుకు వాళ్ళకి క్షమా పణలు చెప్పుకొనేవాడు కొడుకు. అయితే గదిలో కనక ఆమె ఎంత తినాలంటే అంతా తినవచ్చు.

ఆమెకి ఆకలి మరీవిపరీతమైంది. వెనక్కితిరిగి హాల్లోకినిశ్శబ్దంగానడచి వెనకవున్న బయటితలుపులోంచి ముసిలమ్మ వంటింట్లో

చోరబడింది. అక్కడున్న పనివాళ్ళకేసి చూసి భయంగా నవ్వి నెమ్మదిగా ఓగిన్నె తీసికొని సగం ఖాళీ అయిన పెద్ద పళ్ళెంలో వున్న అన్నం, గిన్నెలో సగం నింపుకొని, పనివాళ్ళు తినడంకోసం, మిగిల్చిన భోజనాలున్న బల్లదగ్గరకు చేరుకుందామె. అక్కడ ఆవిడకు ప్రీతైన మిరియంవంటకం కూడా వుంది. అది ముట్టుకోడానికి ఆమెకి సాహసంచాల్లేదు. అయినా అది అక్కర్లేదు. ఉన్నదికాస్తా తీసేసుకుంటే పనివాళ్ళు గోలెడతారు. అక్కడ ఎక్కువగావున్న కాబేజీ మరింతతీసికొని, పనిమనుష్యులకెవరికీ కనబడకండా, ఒకవేళ కొడుకో, కోడలో కనపడతారేమో అనేభయంతో ఎట్లాగైతేం గబగబా తనగదిలోకి వెళ్ళిపోయింది. పనిమనుష్యుల తత్త్వం ఆమెకు బాగా తెలుసు. మళ్ళీ వాళ్ళభోజనంలో వంతుకూడడం వాళ్ళకి కిట్టదు. అయినా ఆమెమీద వాళ్ళకి అదోరకమైన జాలి. అందుకే ఆమెను ఓర్చుకోవడం. ఒక్కొక్కప్పుడు వాళ్ళు ముసిలమ్మ పక్షం నిలిచి ఇంటావిడకు ఎదురు తిరుగుతారు.

గదిలోపల గొళ్ళెంపెట్టి భోజనానికి కూర్చుని ఆబగా ఒక్క మెతుకు కూడా మిగల్చకుండా తినేసి, పనిమనుష్యులకి అనవసరశ్రమ కలిగించడం దేనికని లేచి, ముసిలమ్మ అక్కడే వున్న తొట్టెలో గిన్నె గరిటలూ కడుక్కుంది. నెమ్మదిగా బల్లదగ్గరికెళ్ళి అక్కడున్న డబ్బాలలోని ఒక చిన్న టిన్‌డబ్బా తీసి తెరిచి అందులోంచి కొద్దిచద్దన్నం బయటికితీసింది. ఆఅన్నం అంతక్రితంరోజున దాచిపెట్టిన బాపతు. ఇప్పు డదికూడా పిసుక్కుని ముద్దలు చేసికొని తిన్నది. రకరకాలైన ఎన్నో

తిళ్ళు తెచ్చినవన్నీ ఆ డబ్బాలలో దాస్తూవుంటుంది, ఇతర సమయాలలో ఆకలివేస్తే తిందామని. తిని తీరికగా కూర్చుని పాతవెండి తలసూదులతో పళ్ళు గొలుక్కుంటుంది.

పిల్లలిద్దరిలోనూ ఎవరైనా ఆ ప్రాంతంలో వున్నారేమో అని ముసిలమ్మ కాస్సేపు కూర్చుని, లేచి తలుపు తెరిచి, బయటికొకసారి చూచింది. తనదగ్గరికి పిల్లల్ని పిలవడం ఆమెకు భయం. మామ్మగదివద్దరకు పిల్లలు వెళ్ళడం ఇష్టం వుండదు కోడలికి. ఆవిషయమే ముసిలమ్మ ఒకసారి కదిపితే కోడ లిలా అంది :

“ కిటికీతలుపులు తెరవకు. నీగదివేపునుంచి వచ్చేగాలి వాళ్ళకి అనారోగ్యం. పాడుగుడ్డలు అట్టేబెడతావు. ఆమూలా ఈమూలా అన్నం కప్పెడతావు. గదినిండా చుంచులే — ”

“ ఆకోట్లు ఏమనుకున్నావో — మా అమ్మనాటివి. బాగుండగానే వాటిని ఎలా పారెయ్యడం ? మంచివస్తువులెవరూ పారేసుకోరు. అందులో ముఖ్యంగా తిండీ, గుడ్డా ! నాఈడొచ్చేసరికి నీకూ తెలుస్తుంది. అయినా దరిద్రం చెప్పిరాదు. ఫలానా అప్పు డొస్తుందని ఎవరూ చెప్పలేరు” అన్నది ముసిలమ్మ సమాధానంగా.

దానికి కోడలు అతి తేలికగా చిరునవ్వు నవ్వేసి ఊరుకుంది. పిల్లలు మామ్మగదివైపు వెళ్ళడం ఆమెచూస్తే ఏదో వంకపెట్టి దానికో దీనికో పిల్లల్ని తనకూడా రమ్మని పిలుస్తుంది. అక్కడ పిల్లలెవరైనా వుంటే కాసేపు ఎవరికంటా పడకుండా ఆడుకోవాలని ముసిలమ్మ ఒకసారి అట్లా తపులు

తెరచి వుంచుతుంది. ముసిలమ్మకు రోజూ అదో అలవాటయి పోయింది. పైగా ఆపిల్లలుకూడ కొంచెం బొద్దుగా వుంటారు, ఘుమఘుమలాడుతూ. ఆ పసిబిడ్డల వెన్నలాంటి మెడలపై ముద్దులు కురిపించి, గిలిగింతలతో ఊగిసలాడేంతగా నవ్వించడం ఆవిడకిష్టం.

ఆపిల్లలు పుట్టినప్పుడు ఆమె ఎంతో సంతోషించింది. ఆవిడకు పిల్లలంటే తగని ప్రేమ. ముసిలమ్మకు చిన్నతనంలోనే సంవత్సరమంతా పొలంలో బండచాకిరీ చేస్తేనేగాని పొట్టగడవని ఒకనితో వివాహమైంది. అప్పటినుండీ దగ్గరకొచ్చే ప్రతిపిల్లనీ చేరదీసేది ఆవిడ. ఒకసారి, పంటలు పాడైన సంవత్సరం ఆమె అత్తగారు పిల్లల్ని దగ్గరకు తీయద్దని ఆజ్ఞాపించింది. నిజానికి ఆ ఏడాది చాలామంది ఆకలితో మాడిపోయారు. కాస్త వున్న వాళ్లు కూడ చివరికి ఆదశకే వచ్చారు.

ఆసమయంలోనే ఆవిడ, ఒకశిశువు పుట్టిన వెంటనే మరణించడం చూసింది. అది ఈనాటికీ ముసిలమ్మకి జ్ఞాపకంవచ్చి విచారం కలిగిస్తుంది. ఇంతక్రితం ఆమెకి పుట్టి చనిపోయిన నలుగురిలోనూ ఆడపిల్లకూడ ఒకర్తెగా ముసలమ్మ లెక్కవేసికొంది. దేవుళ్ళు ఆమెదగ్గరనుంచి ఎత్తుకుపోయిన నలుగురిలోనూ ఆపిల్ల కూడ ఒకతె.

బతికి బట్టకట్టి ఎదిగిన ముగ్గురిలోనూ చివరకి ఆవిడకు ఈఒక్కకొడుకే మిగిలాడు. నడివయస్సులో వున్న పెద్దకొడుకు ఎనిమిదేళ్ళక్రితం కలరావచ్చిపోయాడు. ఆమూడోది కూతురు. లేనివాణ్ణి కట్టుకుని మరోగ్రామంలో వుంటూంది. పెట్టిపోషిం

చాల్సిన బాధ్యతగల కొడుకు ఉండగా, అల్లుడు - ఎక్కడో అత్తగారిని పోషిస్తాడని ఎట్లా ఆశించడం ? ఇంతవరకూ కూతుర్ని చూడడం ఆవిడకు పడనేలేదు.

అంచేత ఆవిడను కనిపెట్టి చూడవల్సినవాడు ఈఒక్క కొడుకే మిగిలాడు. ఈకొడుకు అందరిలోకీ మెరుగని ఎప్పుడూ అనుకునేవారు, తనూ తనభర్తానూ. ఇతను చిన్నప్పుడెంతో తెలివిగా వుండేవాడు. అందరిలోకీ మంచిచురుకుగా వుండే వాడు. మొదటినుంచీ అందరికన్నా వీడికే ఎక్కువగాపెట్టా లని, అన్నీ ఇవ్వాలని, ఒకగొప్పవాణ్ణి చేసేయాలనీ వాళ్ళి ద్దరూ అనుకుంటుండేవారు. అందుకే తండ్రి, వాడికి పదేళ్ళ యినా నిండకుండానే దగ్గిరబస్తీలోని విదేశీస్కూలులో చేర్పిం చాడు. అక్కడే వాణ్ణి పదేళ్ళు వదలి వున్నారు. కొందరు పెద్దవాళ్ళు, కుర్రవాళ్ళని ఆస్కూళ్ళలో చదివిస్తే వాళ్ళ మతబోధలు నేర్చుకోవాలని భయపడేవారు. ఆస్కూల్లో చదువు బాగాచెప్పడంచేత, చదువులో కుర్రాడు బాగా తెలివిగావుండడంచేత ఇంటిదగ్గర తిరిగివాడికి చదువులోతర్ఫీదు చేసేవాళ్ళెవరూ లేకపోవడంచేత, ఆ స్కూలువాళ్ళు కుర్రాళ్ళ చేత మతగ్రంథాలు చదివించినా వాళ్ళు ఏమీ పట్టించుకోలేదు. అయితేం ఆకుర్రాడికి కావలసినవన్నీ ఆవిదేశీయులు ఇచ్చారు. మొదట కుర్రాడు ఉగాదిసెలవులకీ, వేసంగి సెలవులకీ ఇంటికి వచ్చేవాడు. కొన్నాళ్ళ తర్వాత ఈ పద్ధతి వాడికి నచ్చలేదు. విద్యాధికుడై పోయేకొద్దీ వాడి కి పల్లెకొంపలూ, మట్టిగో డలూ ఏమీ నచ్చలేదు. విదేశాలు పోయి, పెద్దచదువులు

చదవాలనే వాడి కాంక్షకు ఆ విదేశీయులు మరింత ప్రోద్బలం చేశారు. చాలినంత సహాయం చేయలేకపోయినా, శాస్త్ర ఉప యోగంగా వాళ్ళశక్తికొద్దీ అతనికి సహాయంచేశారు చదువుకి. ఆమెకి ఇంకా బాగాజ్ఞాపకం వుంది. ఒకరోజు భర్తతో ఆమె పొలంలో పనిచేస్తుండగా హఠాత్తుగా వాళ్ళముందుకివచ్చి వాలాడు కొడుకు. అన్నాడు:

"అమ్మా! పెద్దచదువుకి నేను విదేశం పోతున్నాను. వాళ్ళు కొంతడబ్బు సహాయంచేస్తున్నారు. నిన్నూ, నాన్ననీ సహాయంచేయమని అడగడానికి వచ్చా. మీరెంతడబ్బు ఇవ్వ గలిగితే అంతా ఇవ్వండి. మీవార్ధక్యంలో మీకేబాదరబందీ గోలా గొడవా లేకండా నేను కనిపెట్టి చూస్తాను."

మొదట కుర్రాడిని విదేశాలు పంపడమంటే ఏదో క్రూర మైనపనిచేస్తున్నట్టుగా కనిపించింది తండ్రికి. అయినా ఆఇద్దరూ ఆవిషయం కొందరితో ప్రస్తావించగా వాళ్ళు అన్నారు కదా:

"విదేశాలుపోయి పెద్దచదువులు చదివి తిరిగివచ్చి ప్రతి నెలాకొల్లలుగా డబ్బు సంపాదించేవాళ్ళనిగురించి మనం వింటు న్నాం. నువ్వూ మీవాణ్ణి విదేశంలో చదివించినట్లయితే చివరి దశలో కష్టపడకుండా మీరు కాలం వెళ్ళబుచ్చవచ్చు."

దగ్గిరబస్తీలో దుకాణంపెట్టుకుని తనూ, భార్యా సుఖంగా, బతుకుతున్న పెద్దకొడుకును చూచుకుంటూ గడపగలమనే ధీమాతో, కొడుకును ముసిలాళ్ళిద్దరూ, పెళ్ళిచేయకుండానే విదే శంపంపారు. ఆకుర్రాడు ఎంతోదర్జాగా, తనచదువంతటితోనూ ఖచ్చితంగా మాట్లాడుతుంటే, అతనితో పోల్చుకోడానికి కూడ

వీలులేనిమూర్ఖులు, అమాయకులు — ఆతల్లిదండ్రులు వెళ్ళే ముందు అతణ్ణి ఎట్లా పెళ్ళికి బలవంతంచేయాలో కూడా వాళ్ళకి తెలిసిందికాదు. అతను మాట్లాడే అపూర్వమైన మాటలకి వాళ్ళకి ఎలా జవాబీయాలో కూడ తోచలేదు.

అయితే అతను తల్లికీ తండ్రికీ తెలియకుండానే నవీనపద్ధతిలో విదేశాల్లో ఉన్నప్పుడే పెళ్ళిచేసుకున్నాడు. భార్య విదేశస్థురాలో కాదో తెలీదు. కాని అలాగేఉంటుంది తెల్లగా, అతి నాజూకుగా. కిటికీలకు గుడ్డలు వేలాడగట్టటం, నేలమీద ఉన్ని గుడ్డలు పరవడం, పిల్లలు బాగా మురికిలో తిరుగుతున్నారన్నట్లుగా రోజూ చాలాసార్లు పిల్లలకి నీళ్ళుపోయడం — ఇవీ ఆమె అలవాట్లు.

ఇంకా రెండేళ్ళకు కొడుకు వస్తాడనగానే ముసిలాడు చచ్చిపోయాడు. ముసిలాడు చపలచిత్తుడే అయినా చాలా మంచివాడు. చలికాలంలో జ్వరంవచ్చి గుండెనొప్పితో ఒక్క క్షణంలో పోయాడు. వైద్యుణ్ణి పిలిపించి నయంచేయిద్దామని ఆమె అనుకుంటే, అతనికా ఖర్చు కిట్టిందికాదు. చచ్చిపోయాడు. శవపేటికకీ, కర్మకీ డబ్బుఖర్చుపెట్టాలి. ఆవిడదగ్గర ఒక్కపైస లేదు. భూమి కొంతఅమ్మాలి. విదేశంలోవున్న కొడుక్కి సమయానికి డబ్బుపంపుతుండాలి. భూమి అమ్మక తప్పలేదు.

ఒంటి మనిషి. ఆమె ఏవిధంగానూ భూమినంతటినీ దున్ని పండించలేదామె. అంచేత పెద్దభాగంపొలం అమ్మేసి దాంతో ముసిలాడికి మంచి శవపేటిక సిద్ధంచేయించింది. అందులో పడుకోబెట్టే అతనికి తొడగడానికి ఒకకొత్త నీలంరంగుకోటు

ఒకటి కూడ కొంది. అట్లాంటి మంచికోటు ముసిలాడు బతి కుండగా ఎప్పుడూ తొడుక్కోలేదు.

ఆపడాదే ఆమె పెద్దకొడుకు కూడ పోయాడు. అతని కప్పటి కెవ్వరూ పిల్లలు లేరు. చచ్చిపోయాక అతని భార్య పుట్టింటికి వెళ్ళిపోయింది. ఇక ముసిలమ్మకు మిగిలిందల్లా విదేశాల్లో వున్న ఒక్క కొడుకు. అతనికి డబ్బు కావాల్సివచ్చి పంపమని రాస్తే ఆమిగిలినభూమికూడ అమ్మేయగావచ్చిన వెండి కొడుక్కి పంపుమని విదేశీయుడి కిచ్చింది. ఒకసారి పొరిగింటి ముసిలాడు ఆవిడతో అన్నాడు:

"నువ్వు పొలంపూర్తిగా అమ్మకుండా కాస్తయినా మిగల్చ వలసింది. తరవాత కొడుకు నిన్ను చూడకపోతే ఏమిటి గతి?"

కాని ఆమెభయపడలేదు. అన్నది కదా:

"నాకొడుకు మంచివాడు. ఏమైనా అది వాడిపొలమే కదా. కావలిస్తే మళ్ళీ వాడే కొనుక్కుంటాడు. నామట్టుకు నాకేం భయంలేదు. ఏగొడవ, గోలా లేకండా నన్ను కనిపెట్టి చూస్తా నన్నాడు నాకొడుకు. అంచేత వాడింట్లో నాకు స్థానంలేకండా చేస్తాడనే భయం లేనే లేదు" అంటూనే ముసిలమ్మ నవ్వింది. ఆవిడకి కొడుకంటే బొగానమ్మకం.

కాని ఇప్పుడు కొడుకు చెప్పిన సమాధానం చూసి ఆలోచించి ఒక్క నిశ్వాసం విడిచింది ముసిలమ్మ. ఆవిడ ఇప్పుడు కొడుకుఇంటనే వుంది. ఆఇల్లు చాలా అందమైంది. ఇంటికి వచ్చేవాళ్లు ఆఇంటిని విదేశాల్లోని ఇళ్ళతోపోల్చి అందానికి ఆశ్చర్యపడతారు. పైన మరో అంతస్థుకూడా ఆ ఇంటికివుంది.

ఎక్కడానికి మెట్లున్నాయి. ముసిలమ్మ మెట్లెక్కి పైకిరాలేదు కదా అనే వుద్దేశంతోనే వాళ్లు ఆమె గది క్రిందభాగంలోనే ఏర్పాటుచేశారు. ఒకవేళ ఏదోలాగ పైకి కష్టంమీద వచ్చినా, తిరిగి వెంటనే ఆమెను క్రిందికి పంపేస్తారు. క్రింది భాగంలో ఆమెని వదుల్చుకోవాలంటే, కూడా పిల్లల్ని తీసికుని మేడ ఎక్కి కూర్చుంటారు, ఒక్కతెనూ వదలి. వాళ్ళ ఉద్దేశం ఆవిడకు బాగా తెలుసు. వాళ్ళామెను బొత్తిగా ముసిలమ్మగా చూసినా, ఆమెమాత్రం వాళ్ళనలా చూడదు.

నిద్రనుంచి పిల్లలిద్దరూ లేచి అట్లా హాలులోకి వచ్చి కూర్చుని ఆటవస్తువుల్తో ఆడుకుంటుండడం ముసిలమ్మకంట పడ్డది హఠాత్తుగా. ఆఇద్దరూ ఆడపిల్లలు. బాగా చిన్నవాళ్లు. ఆరెండోది పుట్టినప్పుడు ఆముసలమ్మ కొడుకుతో అంది :

“ఈసారైనా మగపిల్లవాడయితే!”

కాని కొడుకు ఖచ్చితంగా అన్నాడు.

“ఆవిధంగా మేం ఎప్పుడూ అనుకోం. ఈ రోజుల్లో కొడుకులూ కూతుళ్లూ సమానమే —”

కొడుకు చెప్పింది గుర్తుకొచ్చి ముసలమ్మ ఒక్కసారి నెమ్మదిగా వినపడకుండా తనలో తను నవ్వుకుంది. కాని ‘ఒకవేళ అంతా ఆడపిల్లల్నే కనిపడేస్తే, తరవాత వాళ్ళకి తండ్రేడీ?’ అనే అలోచన వచ్చింది. అంచేతే మగవాళ్లూ ఆడవాళ్లూ కూడా వుండాలి!

ఆమె తిరిగి వెనక్కి చూచేసరికి రెండోపిల్ల తనకేసే చూస్తూండడం ముసిలమ్మ గమనించింది. ముసిలమ్మపిల్లకేసి

చూస్తూ నవ్వింది. ఆఇద్దరు పిల్లలు అంటే ఆవిడకి ప్రాణం. అందులో ఆరెండోదంటే మరీ ఇష్టం. ఆపిల్లని గిలిగింతలుపెట్టి నవ్వించి ఆడించాలని ఎత్తుకోవాలని ఆవిడకు హఠాత్తుగా బుద్ధి పుట్టింది. నెమ్మదిగా అతిజాగ్రత్తగా నాలికబయటకు వెళ్ళ బెట్టుకొని మీదకొస్తుంటే ఏమిటో తెలియక పిల్ల ముసిలమ్మని చూచింది. ఇంతలో ఏమిఆలోచించుకుందో ముసిలమ్మ టిన్ పెట్టెలలో ఒకటి తెరిచి అందులో పదిరోజులో అంతక్రితమో ఎప్పుడో దాచిపెట్టిన ఒకరొట్టె పైకితీసి చూసింది. ఆరొట్టె తెల్లగా బూజుపట్టివుంది. అది దులిపి చేత్తో రొట్టెను బాగా తుడిచి నెమ్మదిగా ఆబిడ్డకేసి దానిని చూపించింది.

పిల్ల అదిచూసింది. పిల్లకింకా నడకవచ్చీరానట్టుగా వుండ డంచేత లేస్తూ పడుతూ, అతికష్టంమీద ముసిలమ్మదగ్గిర కొచ్చి, రొట్టెకోసం చెయ్యి చాపింది. ఆచేతిని తీసికొని అందులో రొట్టెపెట్టి పిల్లని గదిలోకి తీసికొచ్చి తలుపులు దగ్గరగా వేసి పరుపుమీద కూర్చోబెట్టుకుని పిల్లరొట్టె నోట్లో కుక్కుకుంటూంటే పాప మెడదగ్గర కిలకిలలుపెట్టి ముద్దులు కురిపించింది ముసిలమ్మ.

అంతక్రితమే కొడుకు, కోడలు, మామ్మని అసహ్యించు కోడం పిల్లలకి నేర్పారు. పెద్దపిల్ల జరిగినసంగతి ఎప్పుడు వెళ్ళి తల్లితో చెప్పిందో కోడలు గభాలున ముసిలమ్మ గది తలుపు తెరుచుకొని వచ్చి శాంతంగా అంది :

"ఏమమ్మా! బాగుంది! పాప తోటలో ఆడుకొనే సమయం ఇది" — అంటూండగానే బిడ్డ ఎట్టని పెదవులమీద

ఏదో పదార్థం పలుకులు చూసి ఒక్క నిమిషంలో అంతకుముం దున్న శాంతం అంతా మరచిపోయి ఒక్కగదుమున గదిమిందామె:

"పిల్లకి ఏమిటి పెట్టావ్ ?"

ముసిలమ్మ ధైర్యంగా జవాబిద్దామని యత్నించింది. ఓ చిన్న తీపిరొట్టెముక్క ఏమాత్రంగనక? ఏం చేస్తుంది? అనుకొన్నదేమో ! —

"ఏమీ లేదు—ఓ చిన్న రొట్టెముక్క" —

కాని ఆవిడ్ని తోసుకుంటూ లాక్కుని పిల్ల చేతివేళ్ళు తెరిచి చూచి "ఛా!" — అంది మండిపోతూ. పెదవులుబిగించడం తప్పితే మరేం మాట్లాడలేక బిడ్డని చేతుల్లో ఎత్తుకుని బయటకు తీసుకొనిపోతుంటే బిడ్డ భయంగా ఏడవడమారంభించింది.

ముసిలమ్మ దిగాలుపడి కూర్చునిపోయింది. తాను చేసిందెంతమాత్రం? ఏవిధంగానూ తప్పుకాదు. కాదోదని తనలో గట్టిగా చెప్పుకుంది. ఈనాలుగేళ్ళనుంచీ ఇదేరకంగా ఉంది ఆవిడస్థితి. "పిల్లలు తీపిరొట్టెముక్కంటే సంబరపడతారే" అవే పెట్టడం దోషమా! అవే తల్లిచేత్తో పెడితే మంచివౌతాయి కాబోసు!" అని గొణుక్కుంది ముసిలమ్మ. ఈలోగా ఆవిడకి కాస్త చప్పుడు వినిపించి గుమ్మంకేసి చూసింది. ఎదురుగా పెద్దపిల్ల నిలబడివుంది. చిరునవ్వునవ్వి బిడ్డకేసి చెయ్యిజాచింది ముసిలమ్మ. కాని బిడ్డ అడ్డంగా తలతిప్పేసుకుని అక్కడనించి వెళ్ళిపోయింది. ముసిలమ్మ చెయ్యి అట్లా వాలిపోయింది. "నీకు చెప్పిపెట్టింది వాళ్ళేనా! వాళ్ళే కదూ!" అని లోలోపలే గొణుక్కుని బాధగా నవ్వుకుంది.

ఆపిల్ల వెళ్ళి ఒకసారి ముసిలమ్మకేసి భయపడుతూ చూసి తిన్న ఆమెకేసిచెప్పి కూర్చుని ఆడుకొంటూ ఉండి ఉండి వెనక్కి తిరిగి మామ్మకేసి చూస్తూకూర్చుంది.

ఆరాత్రే చిన్నపిల్లకి జబ్బుచేసింది. అది ఆరోగ్యపిల్లనో, లేక మరెందుకల్లో మొత్తంమీద పిల్లకి జబ్బుచేసింది. ఆ రాత్రంతా తల్లి బిడ్డను కనిపెట్టుకొని వుంది. కొడుక్కికూడా నిద్రలేదు. కాని మరునాటికి అన్నీ సద్దుమణిగిపోయినాయి. ఆరాత్రి హడావుడితో ముసిలమ్మ ఎంతో భయపడ్డది. కులాసాగా వున్నట్టు పనిమనిషివల్లనే తెలిసికపడ్డది భోజనాల గదిలో భోజనంచేయడానికి వెళ్ళినప్పుడు ముసిలమ్మ కొడుకు ఒక్కడే కూర్చోవడంచూసి దగ్గరగాకూర్చుని అతనితో అంది:

“మరేం కంగారు పడనక్కర లేదు అట్లాంటి వాటికి! పిల్లలకి వచ్చే సాధారణమైన జబ్బులే అవి. నాకు జ్ఞాపకం నీచిన్నప్పుడుకూడ ఒకసారి — ”

ఆమె ఇంకా ఏదో చెప్పబోతూవుంది, అడ్డువచ్చాడు కొడుకు. అతనేదో తనతో చెబుతాడేమో అని ఒకసారి అతనికేసి చూసింది ముసిలమ్మ. కాని అతనిముఖం కోపంగా వుంది. ఇక ఒక్కముద్ద తినలేకపోయింది. గరిటె అక్కడేపడేసి అతనివైపు దీర్ఘంగాచూసి అతను తనకొడుకనీ, చిన్నకొడుకనీ ఆమె జ్ఞాపకం తెచ్చుకోడానికి ప్రయత్నించింది. పడ్డేపిల్లాడప్పుడు తనరొమ్మును వెదుక్కుంటూవచ్చే కొడుకుగా జ్ఞాపకం చేసికోడం ఆమెకిక సాధ్యంకాలేదు. ఇప్పటిస్థితిలోనే అతను చిన్నతనంనుంచీ ఉంటున్నాడని ఆమెకి పదేపదే అనిపించింది.

బాగా చదువుకుని, గర్వంతో, విదేశీ వస్తువులలో నెలకొనకూడ ఇష్టపడే పుస్తకాల్లు కనిపించవాడా మెకు. కళ్ళజోడు పెట్టుకొన్నాడను ముఖంలో ఏమీ దయలేదు — వాటిని చూస్తూంటే ఆమెకు అమితంగా భయమేసింది. ఒక్కక్షణంలో తనకోడలుకూడ అక్కడేవుంటే బాగుండునని అనుకుంది. ఎందుకంటే కోడలు ; భర్త — కన్నతల్లితో కర్కశంగా మాట్లాడడం చూస్తే వారి స్తుందని ఆమెకు తెల్సు.

కాని అక్కడున్న కల్లా అదృష్టకే! తల్లీ — కొడుకూ — చివ రకి పనిమనుష్యుల్ని కూడా అక్కడ ఉండకుండా అతను బయ టికి పంపేశాడు .. అయితే ఆమెని చంపుతాడా — ముసలి తల్లిని చంపుతాడా? మరి?

" అమ్మా! నాకన్యాయం అక్కరలేదు. నావిధులు నాకు తెలుసు. ఈఇంట్లో నీకున్న స్థానం ఎట్లాంటిదో నాకు తెలుసు. అయితే ఒకటి! నువ్విక్కడ ఉండదల్చుకుంటే నేను చెప్పినట్లు నువ్వు చెయ్యాలి. నాపిల్లల్ని నువ్వు పాడుచేయకు. నాపిల్లలకి నేనే జవాబుదారీ. ఇంతకుముం దెన్ని సార్లు బతిమలాడి చెప్పాం- పిల్లలకి ఏమీ పెట్టవద్దని ; అందులోనూ మే మేదో నిన్ను పస్తులుంచుతున్నట్లు నువ్వు నీగదిలో దాచి మురగబెట్టే పాడు సరకులు నిన్న ......" తనపాతకోపాన్ని అణుచుకోవడం కోసం అతను ఒక్కక్షణం చెప్పడం ఆపి తిరిగి శాంతంగా ప్రారంభించాడు: " నిన్న మామూలు కాదని ఆఇచ్చినదేమిటో తెలియనిదానికి ఆపిల్లకి పెట్టావు. రాత్రిఅంతా దానికేమీ బాగులేదు " అన్నా డతను.

"అది చాలా చిన్నరొొష్టే— మంచిదేరా అబ్బాయ్" అన్నది ముసిలమ్మ ఇంకా వదలని పట్టుదలతో.

"ఏమైనా కానీ వాళ్ళకేమీ పెట్టవద్దని నీతో చెప్పామా లేదా?"— ముసలకించాడు కొడుకు. ముసిలమ్మ మరి కిక్కురు మనలేదు. ఒక్క క్షణం సహించలేక పెద్దపెట్టున ఏడవడ మారంభించింది ముసిలమ్మ.

"అయితే పొమ్మంటావా! పోనీయండి పోతా! నాకిక ఇల్లూలేదు, వాకిలీ లేదు. పోతాను!"—

ఆమె కాస్త శాంతపడేవరకూ కొడుకు ఓరిమితో ఆగి అన్నాడు: "అమ్మా! కాస్త ఆలోచించు; ఎట్లాపోతావు నువ్వు? ఈ ప్రపంచంలో ఎక్కడకని పోతావు చెప్పు?"—

"నేను నాకూతురుగారింటికి పోతాను" అన్నది బిగ్గరగా ముసిలమ్మ. "అక్కడేవుండి అల్లుడింట్లో చాకిరీచేసి బతుకుతాను. నేనింకా బలంగానేవున్నా. గడ్డీగాదా పోగుచేసికొస్తా. ఇల్లు తుడుస్తా. పొయ్యిలో మంట ఎగసంతోస్తా. పిల్లల్ని కనిపెట్టు కొని వుంటా. నాభుక్తికి సరిపడ్డది నేను తెచ్చుకోగల్ను"—

దానికి కొడుకు వెకిలిగా నవ్వి అన్నాడు: "నేనది ఆలోచించలేదనుకున్నావా? నిన్నక్కడ ఉంచుకుంటానంటే నెల కింతడబ్బు చొప్పున పంపుతానని వ్రాశాను వాళ్ళకి. నువ్వు ఈఇంటి అలవాట్లని అలవర్చుకోవు. అంచేత నాభార్యకి చాలా ఇబ్బందిగా వుంది. ఆవ్రాసిన ఉత్తరానికి జవాబుగా మా ఇంట్లోనే మాపిల్లలతో వేగలేకండావున్నాం, ఇంకెక్కడ అని వ్రాశారు"—

దానితో ముసిలమ్మ మరి మాట్లాడలేదు. నిజంగా ఆమె ఆలోచించలేదు. అదీ నిజమే. తన చెప్పుడూ వాళ్ళు ఉంచు కోరు. ఇంతవరకూ ఇంకా ఏవో అనుకొనేది కూతురుగారింటికీ పోవచ్చని. కోడలితోకూడా కొడుకుతోకూడా కోపంవస్తే వెనకాల పనిమనుష్యులదగ్గర సణుక్కుంటుంది. ఇంటికి ఎవరొస్తే వారిదగ్గర అంటుంది. చివరకి కూరగాయలు మనిషితోనైనా ఆవిషయం చెప్పేస్తుంది :

"నాకిక్కడ ఈకొడుకూ కోడలితో ఉండడం ఇష్టంలేక పోతే నాకూతురుగారింటికి పోతాను. వాళ్ళకి మంచి భూములున్నాయి."

కాని ఇకముందు తాను అట్లా అనలేనని ఆమెకు తెలుసు. ఒకవేళ అన్నట్లయితే కొడుకు కష్టంగా తనకేసి చూస్తాడు. తన తల్లిని ఎవరైనా ఉంచినట్లయితే డబ్బిస్తానని అత నెన్నో సార్లు చెప్పాడు. కాని ఎవరూ ఆమెను పెట్టుకోలేదు. ముసిలమ్మ తల వంచుకుంది.

"చూడమ్మా! నాభార్య చదువుకుంది. నువ్వు అమాయకపుదానివి. ఇప్పుడు మనిద్దరం ఒంటరిగా ఉన్నాం కనక నేనీ మాటలు నీతో అంటున్నాను. నాపిల్లలు నవీనపద్ధతుల్లో నే పెరగాలి. నే నా విధంగా నే చేయాలనుకుంటున్నాను. మీరున్న ఇంటిమాదిరిగా ఇప్పుడు నాఇల్లు ఉండడానికి వీల్లేదు. ఎక్కడ పడితే అక్కడ నేలమీద ఉమ్మి వేయకూడదు. కోళ్ళు ఎక్కడ పడితే అక్కడ తిరగనివ్వకూడదు. నీపిల్లలలాగ నాపిల్లలు అవీ ఇవీ తినడానికి వీల్లేదు."

దీంతో ముసిలమ్మ హృదయంలో రోషం చివ్వున లేచింది. ఏడుస్తూ అందామె :

"అయితే నువ్వు నాకొడుకువి కాదు!"

కొడుకు విడమరిచి చెప్పాడు :

"నీలాగ నేనేమీ ఉన్న ఏడుగురుపిల్లల్లోనూ నలుగురిని చంపుకోలేను" —

ఆమాటతో ముసిలమ్మ గజగజలాడిపోయి అతనికేసి మరో సారి చూసి ఏడ్చింది: "నాపిల్లల్ని నేను చంపుకుంటే నువ్వు దానికి శిక్ష వేస్తావా అయితే?"

కొడుకు ఓరిమి నశించిపోయింది. ఇంక అత నెంతమాత్రం తన గొంతును తగ్గుస్థాయిలో ఉంచుకొనే స్థితిలో లేడు. బిగ్గరగా అన్నాడు :

"నీమూర్ఖత్వాన్ని శిక్షిస్తాను. ఇదే మంచిపద్ధతి. నువ్వు గ్రహించడానికి నీచాదస్తాన్ని శిక్షిస్తాను — అంతే!" అతని కింక చెప్పడానికేం లేక చివరికఠినమైనమాటలను అనేసి వెళ్ళి పోయాడు. ముసిలిది వణికే కంఠంతో వెనక్కిపిలిచింది :

"అయితే నేచస్తా! ఎలాగైనా నేను చావాలి! నేనే ఉరి పోసుకొని ......"

ఆమాటలువిని మరింత మండుకొచ్చిం దతడికి. గిరుక్కున వెనక్కి తిరిగాడు. ముసిలితల్లి ముఖంలో తుదిసాహసం, నిరాశ చూశాడు. కోపంతో గట్టిగా అన్నాడు:

"నాతోనేనా! నువ్వు అంటున్న దికి ఫలానావాడితల్లి కొడుకు ఇంట్లోనే ఉరిబోసుకు చచ్చిందనే వాదు నలుగురిలో వేసి నన్ను

ఆమె శుశ్రూష చెయ్యడానికా!" – అంటూ గోడపక్కనున్న గంట నొక్కాడు. వెంటనే ఒక పనిమనిషి లోపలికి వచ్చింది.

"నాకు అమ్మకు మతిపోయిన లక్షణాలు కనిపిస్తున్నాయి. ఇకమీదట అక్కడే వుంటూ, ఆమెను వదలకుండా రాత్రీపగలూ కని పెట్టుకొని వుండేందుకు ఒక అమ్మాయిని కుదుర్చు – కుదిర్చే భారం నీదే" అని అతను బయటకు వెళ్ళిపోయాడు.

ముసిలమ్మ పెద్దపెద్ద కేకలతో ఏడ్వటం ప్రారంభించింది – తనని కనిపెట్టుకోవడం చాలా కష్టంగావుందని ఆ పనిమనిషి కొడుక్కీ కోడలికీ ఫిర్యాదులుచేసింది. ప్రత్యేకంగా ఆమెను కని పెట్టుకొని వుండడానికి ఎవరినైనా మరొకరిని ఎట్లానూ నియ మించాలి గనక తన చెల్లెలినే ఆపనిలో పెట్టవచ్చునని అభిప్రాయ పడింది ఆ పనిమనిషి. "ఓమనిషి ఆమెను ప్రత్యేకం కనిపెట్టు కొని వుండాలి" అంది వణుకుతూ. ముసిలమ్మ పనిమనిషి కేసి తిరిగి "ఆఖరికి నన్ను చావనైనా చావనీయడేంకర్మం? చావ డానికికూడా వీల్లేదా" అని ఏడ్చింది. చిన్నపిల్లలా ఏడుస్తూ ముసిలమ్మ పనిమనిషి సాయంతో కుర్చీదగ్గరకు నడచివెళ్ళింది–

"కూర్చో! కూర్చో! ముసిలమ్మా! నీకొడుకు నీకు తిండీ బట్టా అన్నీ ఇస్తున్నా, నువ్వే ఇష్టపడకుండావున్నావ్! ఆఁ. ఆయనమంచి ఓర్పుగలమనిషి అని అంతాఅంటూరు. నీకు తెలుసో లేదో!" అన్నది పనిమనిషి. ఎప్పుడుచెబుదామా అని కని పెట్టుకున్నదల్లా కుండపగలగొట్టినట్లు చివరకి అనేసింది.

# విజ్ఞాన విశేషాలు

## వసంతరావు వెంకటరావు

---

### మొదటి సంపుటం : విజ్ఞాన సీమలు

1. నియతం కురు కర్మ. 2. న బుద్ధిభేదం జనయేత్. 3. స్వాతి : 4. మిథేనియా. 5. త్రివిధా భవతి శ్రద్ధా.

### రెండో సంపుటం : విజ్ఞాన స్రవంతి

1. గతి లోక ప్రయాణం. 2. గతానలోకనము. 3. వైజ్ఞానిక సత్యాలు. 4. విజ్ఞానోద్దేశాలు. 5. ఫ్లయింగ్ సాసర్లు.

### మూడో సంపుటం : విజ్ఞానవికాసం

1. మానవశ్రేయస్సు, 2. జనాకీర్ణ లోకాలు, 3. రాకెట్లులో ఆకాశయానం, 4. ఇహపరాలు, 5. కుజుడు, 6. క్షేత్రసిద్ధాంతాలు.

### నాలుగో సంపుటం : విజ్ఞాన స్ఫులింగాలు

1. అన్యలోక నివాసం, 2. చంద్రబింబానికి వృద్ధిక్షయాలు నిజంగా కలుగుతున్నాయా? 3. నక్షత్రాల వర్తమానం తెలుసుకోగలమా? 4. మనభూమి పెరుగుతూనేవుంది, 5. ఆకాశస్థావరాలు, 6. భూదేవి కప్పుకొన్న గాలిదుప్పటి, 7. ఆవిరిశక్తి, 8. ఉదజని బాంబు పేలితే భూగోళం సూర్యగోళం అవుతుందా? 9. శక్తి వశీకరణమే మానవాభ్యుదయ సాధనము, 10. మానవప్రతిసృష్టి.

ఒక్కొక్క సంపుటం వెల రు. 1-0-0



పబ్లిషర్సు : అద్దేపల్లి అండు కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

Oppandam (Stories) Re 1/-



# ఉత్తమ గ్రంథాలకు

నవలలు

నాటకములు

కథలు

చరిత్రలు

ప్రబంధములు

పౌరాణికములు

వైజ్ఞానికములు

వైద్యగ్రంథములు

## సరస్వతీ గ్రంథమండలి





పబ్లిషర్సు: అడ్డేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రనగము